# మలయమారుతాలు



(దీర్ఘ కవితలు)

బెజవాడ గోపాలరెడ్డి

అభినందనము

శ్రీ గుఱ్ఱం వేంకట సుబ్రహ్మణ్యం

# మలయమారుతాలు

## (దీర్ఘకవితలు)



బెజవాడ గోపాలరెడ్డి

అభినందనము

శ్రీ గుర్రం వేంకట సుబ్రహ్మణ్యం

MALAYA MARUTALU

Book of Poems—Telugu

BY B. GOPALA REDDI

ప్రథమ ముద్రణ
జూలై 1985



వెల: ఎనిమిది రూపాయలు

ప్రతులకు :
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-1

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజయవాడ

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు-1

# గ్రంథకర్త జీవన వివరాలు

| | |
|---|---|
| జననము | — 5 ఆగస్టు, 1907<br>బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా.<br>తండ్రి - పట్టాభిరామిరెడ్డి<br>తల్లి - సీతమ్మ. |
| చదువు | — బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు.<br>ఆంధ్ర జాతీయ కళాశాల<br>(1921-24).<br>విశ్వభారతి<br>(1924-27). |
| సమరపర్వము | — సర్కారుబడి వదులుట జనవరి 1921.<br>జైలు శిక్షలు - ఆరు మారులు.<br>1930, 31, 32, 33 లోను,<br>1940, 41, 42, 43 లోను,<br>కొంతభాగాల్లో జైలులో ఉండినారు. దాదాపు<br>4 సం॥లు జైలులో మకాం. ఎ బి సి క్లాసుల<br>ఖైదీగా, డెటిన్యూగా. |
| ఉద్యోగపర్వము | — మంత్రిగా - మద్రాసు, కర్నూలు,<br>హైదరాబాదు, ఢిల్లీలలో - 186 మాసాలు<br>గవర్నరుగా - ఉత్తరప్రదేశ్‌లో 62 మాసాలు<br>ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రోఛాన్సలర్-<br>జూన్ 1951 నుండి 57 వరకు. |
| సాహిత్యపర్వము | — తెలుగు భాషా సమితి అధ్యక్షులు - 1948 నుండి<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - ఆగస్టు<br>1957 నుండి డిసెంబరు 1982 వరకు<br>కేంద్ర సాహిత్య అకాడమీ రెండవతూరి-<br>1978 జనవరి నుండి 82 డిసెంబరు వరకు,<br>83 జనవరి నుండి<br>జ్ఞానపీఠము - 1963 నుండి 1971 వరకు. |

# బెజవాడ గోపాలరెడ్డి

## పుస్తకాలు

### వేయి సోయగములు

'ఆమె' పంచకము

1. ఆమె (1978)
2. ఆమె నావలు (1981)
3. ఆమె నీడలు (1981)
4. ఆమె [illegible] (1982)
5. ఆమె వెణుకులు (1982)
6. స్ఫులింగాలు-తుషారాలు (1984)

### శతకవితలు

'కవితా' పంచకము

7. కాలవాహిని (1979)
8. సాహిత్య సుందరి (1980)
9. ప్రసూన మంజరి (1981)
10. పరిమళ తరంగాలు (1982)
11. సాగర సమీరాలు (1983)
12. మలయ మారుతాలు (1985)

### [illegible]

ఇక్బాల్ షికాయ - జవాబు

ఇతర కవితలు (ఉర్దూ నుండి)

[illegible]

### బెంగాలీ నుండి (రవీంద్రునివి)

1. రవీంద్రుని నాటికలు
(5 పుస్తకాల సంపుటి)
2. కథలు - కల్పనలు
3. వానచినుకులు
4. ఊర్వశి - కాళిదాసు
5. నైవేద్యము-స్మరణ
6. తాజ్‌మహల్

# అంకితము

స్వయముగా విదుషీమణియై
సాహిత్యమకరందముల చవిచూచి
భర్త శ్రీ బాలకృష్ణారెడ్డిగారిని
ఎల్లవేళల పండిత సత్కారానికి
కవిపోషణకు ప్రోత్సహించుచుండిన

# స్వర్గీయ ఎర్రంరెడ్డి రంగనాయకమ్మగారి

స్మృతిమందిరమున అర్పితము

# శ్రద్ధాంజలి

సుమారు సంవత్సరం క్రిందటి సంగతి, హైదరాబాదు రాజభవనంలో డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారితో ఒక సాయంత్రం సాహితీ గోష్ఠిలో ఉండగా ఒక సౌమ్య సౌజన్యమూర్తి లోపలకు వచ్చారు. ఆ వచ్చిన వ్యక్తిని స్నేహపూర్వకంగా పలకరించి శ్రీ గోపాలరెడ్డిగారు నాకు పరిచయం చేశారు. అంతకుముందే శ్రీ వై. బి. రెడ్డిగారిని గురించి నేను విని ఉన్నందున వారి పరిచయ భాగ్యం కలిగినందుకు ఎంతో ఆనందించాను.

"ఎన్నాళ్లొ మన కోలె ఈ సుకములంటి
కంట నీరెట్టింది జంట నా యెంకి"

అంటూ-నాకు ఇష్టమైన నండూరి పాట పలుకుతూ నన్ను పలకరించారు వై. బి. రెడ్డిగారు. ఆ పలకరిస్తున్నప్పుడు వారి కంఠంలో గాద్గద్యం-కనుకొలకుల్లో కన్నీరు-తన సర్వస్వమూ పోగొట్టుకున్న దీనత్వం.

వారిని చూచిన క్షణంనుంచే, నాకు ఒక ఆత్మీయానుబంధం కలిగింది. ధర్మపత్నిని పోగొట్టుకొన్న ధర్మమూర్తి, జీవన సహచరిని కోల్పోయిన వైరాగ్యమూర్తి, ప్రాణంలో ప్రాణమైన అర్ధభాగం భౌతికంగా దూరమైనప్పటి విషాదమూర్తి-నేను తొలిసారిగా చూచిన వై. బి. రెడ్డిగారు.

వారితో పరిచయం పెంపొందింది. ఉత్తర ప్రత్యుత్తరాలు పెరిగాయి. విజ్ఞతలోను, ఉత్తమ సాహితీ సంస్కారంలోను-వారితో నాకు ఏమాత్రమూ పోలిక లేకపోయినా- మా ఇద్దరిమధ్యా ఒక స్నిగ్ధరేఖ చివురించింది.

రెడ్డిగారితో అప్పుడప్పుడూ కలిసినప్పటి సంభాషణల్లో-వారి ఉత్తరాలలో- నాకు ఒక అపురూప అనురాగ మూర్తితో పరిచయం కలిగింది. ఆమెను నేను

భౌతికంగా చూడలేదు-అయినా, ఆమెను అంతర్దృష్టితో చూచాను. ఆమె మృదు మధుర భాషణను వినలేదు. అయినా, ఎక్కడో ఎప్పుడో ఆ కోమల స్వరాన్ని విన్నట్లుగానే అనుభూతిని చెందాను. ఆమె మానసిక సంస్కారాన్నీ, సాహితీ ప్రియత్వాన్నీ, సౌజన్యాన్నీ, దయాంతరంగాన్నీ-విని ఒక ఊహామూర్తిని సృజించుకున్నాను.

చిత్రం! శ్రీ వై. బి. రెడ్డిగారు ఆమెను గురించి నా మనసులో ఒక చిత్రం చిత్రించారు! ఆ చిత్రం ఎంత అతిలోకమైనది! ఆ సమగ్ర దర్శనం నాకు కలిగించింది రెడ్డిగారే అయినా-ఆత్మలో ఆ భావనామూర్తిని సందర్శించుకోగలిగిన ఆనందం నాది. ఆ ఆనందంతో, ఆత్మబలంతోనే ఈ సంస్మరణ పూర్వకమైన మాటలు వ్రాయడానికి సాహసించాను.

శ్రీ వై. బి. రెడ్డిగారూ, రంగనాయకమ్మగారూ భారతీయ దాంపత్య జీవన సౌభాగ్యానికి ప్రతీకలుగా తోచారు నాకు. దంపతులు కలిసి జీవించటమూ, సంతానం పొందటమూ, కష్టసుఖాలు పంచుకోవటమూ సర్వసామాన్య విషయమే! దాంపత్య జీవనానికి అత్యంత రాగమాధుర్యాన్ని కలిగించేది చక్కని చిక్కని స్నేహబంధం. ఆ స్నేహబంధాన్ని చేజిక్కించుకున్న అదృష్టవంతులు ఆ దంపతులు.

రెడ్డిగారు చెప్పరు కాని-వారు ప్రాచీన సాహిత్యం పుక్కిట పట్టినవారు. నోటికి వచ్చిన పందల పద్యాలలో కొన్నింటిని వారు చదువుతుండగా-'ఆమె' లోపలనుంచివచ్చి-ఆ పద్యపాదాన్ని పూరిస్తూ ఉండేదట! పండితులు వీరి కవి పండిత పోషకత్వం గురించి విని ఇంటికివస్తే-భర్తను లోపలకు రమ్మని సైగచేసి పిలిచి-''వారిని అంతసేపు ఎందుకు కూర్చోపెడతారు! ఇదుగో! ఈ సొమ్ము వారికి ఇచ్చి సంతృప్తి పరచండి!'' అని కొంతసొమ్ము వారిచేతిలో పెట్టి పంపించేదట! కావ్య రసాస్వాదనా మాధుర్యంలోనే ఆ పుణ్య దంపతులు ప్రణయానుభవాన్ని పండించుకునే వారట!

ఎక్కడైనా ఊహించగలమా ఆ అత్యంత సుందరమైన దాంపత్య వైభవం!

'ఆమె' భౌతికంగా దూరమయినాక-రెడ్డిగారిని విషాదయోగం ఆవరించింది. మాటలకు, ఊరడింపులకు ఆగని వ్యథ అది. తమ హృదయంలో నిండిన అంధకార సదృశమైన వైరాగ్యాన్ని వారి మాటలలోనే చెప్పటం ఈ సందర్భంలో అనుచితం కాదు: "ఆరు మాసములైనది ఆమెకు సుఖాంతము-నాకు విషాదానుభవము తటస్థించి''.

''ఎటులనో ఈ ఏకాకి జీవితము గడుపుతున్నాను- "జరసా యస్మిన్ ఆహార్యోరసః'' అన్న భవభూతి వాక్యమును ఆధారం చేసికొని దాంపత్య జీవిత మధుర స్మృతులను గుర్తు చేసుకుంటూ గడుపుతున్నాను.''

అలనాటి మా దాంపత్య ఆనందానుభూతి నిత్యనూతనంగా ప్రవర్ధిల్లుతున్నది, కాని, మధ్య-ఏకాకిని నేడు-అను యథార్థము గుర్తునకు వచ్చి మనసున అంధకారం ఆవరిస్తున్నది, ఏమిచేయగలనమ్మా ! కొరనోములు నోచిన అభాగ్యుడను!"

''నాకు అంతా శూన్యం, నిరాశ-నిస్పృహ-రఘువంశంలో అజమహారాజు అంటాడు-

'గృహిణీ సచివ స్సఖామిథః
ప్రియశిష్యా లలితే కలావిధౌ
కరుణా విముఖేన మృత్యునా
హరతాత్వా వద కిం నమేహృతం'

ఆ కరుణా విముఖుడైన మృత్యువు నాది ఏమి హరించలేదో చెప్పుము-అంటాడు-అంతే నా ప్రలాపన కూడ !''

కరుణ రసార్ద్రమయమైన రెడ్డిగారి ఈ పలుకులు అప్పటప్పట నాతో సంభాషించి నట్టివి. ఉత్తరాలలో వ్రాసినట్టివి.

రెడ్డిగారి అపారమైన ప్రేమానుభవాన్ని పొందగలిగిన భాగ్యశాలిని ఆమె-వారి తనువునూ మనస్సునూ పండించి, జన్మ సార్థకత చేసుకొన్న పుణ్యమూర్తి ఆమె !

ఆమెను భౌతికంగా నేను ఎరగను-రెడ్డిగారు ఆ మాటను ఒకసారి ప్రస్తా విస్తూ-ఇలా అన్నారు.

"ఆమెను ప్రత్యక్షంగా నీవు ఎరగవు. ఆ వరవర్ణిని సాంగత్యమున కొన్ని గంటలు గడిపి యుండిన మరెంతగా నీవు మాకు సన్నిహితురాలవై యుందువోనని విచికిత్స"

ఆ విచికిత్సతో పనిలేదు. ఆ దివ్యమూర్తిని ఆత్మభావనతో సాక్షాత్కరింప చేసుకోగలిగిన అదృష్టం కలిగించారు తెత్తిగారు. ఆమె అందరితోపాటూ నాకు ఆత్మ కూర్చిన అమ్మమ్మ. ఇప్పటికీ, ఎప్పటికీ మనసులో చెరిగిపోని మధుర స్మృతి ఈ అమ్మమ్మ. ఆమె సంస్మరణ కోసం రెడ్డిగారు అపురూపమైన సాహిత్య జ్యోతులను వెలిగిస్తున్నారు. ఏ భార్యకు ఏ భర్తచేత అంతటి మన్ననా, సంభావ్యతా పొందగలిగిన అదృష్టం కలుగుతుంది !

1982
హైదరాబాదు.

సి. వేదవతి

# శీర్షికలు


| | | | పుట |
|---|---|---|---|
| 1. | మానవోదయం | .... | 1 |
| 2. | మానవ పాటవము | .... | 16 |
| 3. | సన్మాన పత్రము | .... | 21 |
| 4. | చింతపూత | .... | 25 |
| 5. | ఎల్లప్రాయము | .... | 28 |
| 6. | వీచికలు — 1 | .... | 30 |
| 7. | స్పీడు బ్రేకర్లు | .... | 34 |
| 8. | నెరజాణ | .... | 37 |
| 9. | కాంగ్రెసు శతాబ్ది భవనము | .... | 42 |
| 10. | నటరాజు | .... | 47 |
| 11. | భక్తులు | .... | 52 |
| 12. | కురుక్షేత్రము | .... | 56 |
| 13. | కర్ఫ్యూలో నిక్కా | .... | 60 |
| 14. | ఆత్మోన్నతి | .... | 62 |
| 15. | రవలకమ్మలు | .... | 68 |
| 16. | గంగా క్రతువు | .... | 73 |
| 17. | శాంతి | .... | 77 |
| 18 | నివాసము - విహారము | .... | 80 |
| 19. | హేమంతము | .... | 84 |
| 20. | ఆల్బమ్స్ | .... | 86 |
| 21. | ఎంతటి ఉపేక్ష | .... | 90 |
| 22. | పిల్ల కోపము | .... | 92 |
| 23. | వీచికలు - 2 | .... | 94 |

# నివేదన

'మలయ మారుతాలు' దీర్ఘ కవితల నా ఆరవ పుస్తకము. శత కవితల పంచకము పూర్తియైన పిదప, నా కవితానౌక అనుకొన్న రేవుకు చేరినదని సంతుష్టి చెందాను. తెరల దింపివేశాను. తెరలు లేకనే, నౌక నడుస్తున్నది నెమ్మది గానే. స్ఫులింగాలు- తుషారాలు అనే రెండు పుస్తకాల ఒకే సంపుటము 440 ముక్తకాలతో పోయిన ఏడు ప్రచురణ చేశాను. ముక్తకాల 'ఉత్తర రామాయణము' అన్నాను. అట్లనే దీర్ఘ కవితల ఈ సంపుటము వెలికి వచ్చుచున్నది.

ఇందు మూడు కవితలు రవీంద్రునివి. ఇంగ్లీషునుంకి అనువదించినవి. నేను ఇంగ్లీషునుండి ఎన్నడు అనువదించలేదు. వారు అస్తమించుటకు 5 సంవత్సర ముల పూర్వము వ్రాసిన 'శ్యామలి' నుండి ఇంగ్లీషునకు తర్జుమా చేయబడినవి. వారు రచించిన నాలుగు వచన కవితల పుస్తకాలలో 'శ్యామలి' ఒకటి. కేవలము మట్టితోనే కట్టించుకొని, తాను వసించుచుండిన కుటీరానికి 'శ్యామలి' అని పేరు పెట్టారు. ఎల్లప్రాయము ఒక కవితలోని కొన్ని భాగాలు మాత్రమే. మానవుని మీద నా విశ్వాసాన్ని, అభిమానాన్ని మూడు కవితల్లో వెలువరించాను. 1. మాన వోదయము 2. మానవ పాటవము 3. మానవయత్నము. అతని గమ్యమును ఊహించుకొన్నాను. అతని నేర్పరితనమును ప్రస్తుతించాను. అతని యత్నము నకు తెరువని తలుపులు లేవని ప్రబోధించాను. మూడు నాకు ఇష్టమైన కవితలు. అట్లనే నెరజాణ కవిత కూడ. నాట్యలోలుడు నటరాజుని గూర్చి కావ్యాలముగ వ్రాయాలని ఆసక్తి. కడకు సాహసించి నటరాజు అను కవితను వ్రాశాను. ఏదో ఒక శీర్షికపై ఉపన్యసించి, సన్మానము పొందమని కోరిన స్నేహితునితో, అది నా వల్లకాదు. దానికి నేను తగను అని చెప్పి వీచికలలో మొదటి భాగము వ్రాశాను. ఈ సంపుటిలో 26 వీచికలు రెండుభాగాల్లో ఉన్నాయి. అవి ముక్తకాలే. పూర్తి సంపుటికి తగినన్ని వ్రాయలేనేమోయని మలయ మారుతాలలో చేర్చినాను. ఆమె పంచకములో, స్ఫులింగాలు - తుషారాలతో కలిసి 1500 ముక్తకాలు వ్రాశాను. ఇప్పుడు మరలా 'వీచికలు'. 'స్వప్నహారము' అనే పుస్తకానికి తయారగు

చున్నాను. అందు ముక్తకాలు, దీర్ఘ కవితలు, గాలిబ్ కవితలు ఉండవచ్చు. సాగు చున్న కవితావసంతమును ఆపుట ఎందుకు? సాగనీ.

అంకితము స్వర్గీయ యర్రంరెడ్డి రంగనాయకమ్మ గారికి. వారిని గూర్చి 1983 సంవత్సరములో మా శ్రేయోభిలాషి శ్రీమతి సి. వేదవతిగారు ప్రచురించిన శ్రద్ధాంజలి నన్ను ఆకర్షించినది. నా అంకితానుబంధముగ దానిని చేర్చుటకు శ్రీ వేదవతి గారు అనుమతించారు. వారికి కృతజ్ఞతలు.

'అభినందనము' అని ముందు మాటల వ్రాసిన సహృదయులు, హితైషులు శ్రీ గుర్రం వేంకట సుబ్రహ్మణ్యం గారికి కృతజ్ఞతాభివందనాలు తెలుపుచున్నాను. కాళిదాసు ఏడు గ్రంథములను అనువదించిన కీర్తి వారికే దక్కుచున్నది. వాల్మీకిని, శంకరుని కూడ అనువదించిరి. సంస్కృత పాండిత్యముతో కూడ ఇంగ్లీషు సాహిత్యముతో గాఢ పరిచయము వారి వైదుష్యమునకు వన్నె తెచ్చుచున్నది. పండిత సత్కారము, ఆతిథ్యము వారికి సాంప్రదాయ సిద్ధమైనది. వ్యక్తిగతము గను ఉత్తములు. మంచి స్నేహితులు. వారు ముందుమాట వ్రాయుట నాకు గర్వకారణము.

ముద్రణలో సాయపడిన వారి కందరికి వందనములు.

శాంతినికేతన్,
నెల్లూరు-3
31-5-1985

బెజవాడ గోపాలరెడ్డి

# మానవోదయము

ప్రాప్తమైన విజ్ఞాన సంపదను వినియోగించి
వ్యోమ మండలమంతా వెదకుచున్నారు.
శక్తివంతమైన దుర్భిణుల నేత్రాలతో
లక్షల కోట్లమైళ్ళ దూరాల పరికించారు.
నక్షత్రాల వివరాల సేకరించారు.
ప్రసరించే కాంతుల పరీక్ష చేశారు.
వాని భారాల నిర్ణయించారు.
ఇరుగు పొరుగులలో నున్న
గ్రహాల వేయి కన్నులతో చూచారు.
అంగారక గ్రహాన్ని కఠిన పరీక్షలకు లోను చేశారు.

విశాల బ్రహ్మాండములో ఏ మూలనైన
ప్రాణవాయువులున్నాయా
ప్రాణులు వసించుటకు
ఉచితమైన శీతోష్ణాదులున్నాయా
ప్రాణులు పెరుగుటకు ఉదకాలున్నాయా
ఈ ప్రశ్నలకు సమాధానాలు వెదకారు.
సాధనలన్నీ వినియోగించి, బుద్ధిబలాన్ని వెచ్చించి
మానవునంటివాడు, ఇంకా మిన్నయైనవాడు
ఉన్నాడేమోయని ఉత్కంఠతో ఉల్లాసముతో చూచారు

ప్రతిరూపుని విశ్వదిగంత దర్పణములో
చూడగలమేమోయని వాంఛించారు.
నేటివనుక ఆచోకీ దొరకలేదు.
విశాల బ్రహ్మాండము ప్రాణశూన్యముగానే యున్నది.

ఎన్నివేల కోట్ల గోళాలున్నాయి !
ఎందున ప్రాణిలేదా? భూలోకమేనా వాసయోగ్యము?
ఈ ప్రశ్న నిగూఢ ప్రశ్నగానే నిలిచిపోయింది.
రహస్య కవాటాలు తెరువబడునా
అచ్చటి వివరాలు మనకు చేరుతాయా
చేరినా, గ్రహించుకోగలమా
ప్రశ్నావళి సమాధానము
మానవుని పరిశోధనా హస్తమునకు చిక్కలేదు
ముందు శతాబ్దాలలో ఏమగునో చూడాలి
ప్రస్తుతానికి భూలోకమే మానవవాస గోళము
అన్ని ప్రాణులకన్న మిన్నగా
ప్రకృతిలో చరమ స్థితిని పొంది
ఉన్నత సింహాసనముపై అధిష్ఠించియున్నాడు
ఇతర ప్రాణులకులేని శక్తులు సంపాదించాడు
అన్నిటిపైన పెత్తనము వహించాడు శాసిస్తున్నాడు

తొలుత మానవుడు ఉదయించినపుడు
ఎట్లా ఉండెనో, అట్లే ఉన్నాడా, ప్రస్తుతము
క్రమేణ సహస్రాబ్దములలో మారుచున్నాడా,
ముమ్ముందు మారనున్నాడా,

అనేదే మన పరిశీలన
భూతకాల అతిదూర యుగాలను
సమీక్షించాలె భవిష్యత్తు అతిదూర యోజనాలను
మానవ దీర్ఘయాత్రలో
ఎన్ని మజిలీల దాటెనో, ఎన్ని దాటగలడో
సమీక్షించాలె.
మనోదేహములు సహస్రాబ్దములలో
స్తంభించి ముకుళాయమానముగా ఉన్నాయా
కమలమురీతి దళముల విప్పుచు
నవసౌరభముల చిమ్ముచూ
సాగుచున్నదా అనునది
కుతూహలమును హెచ్చించే ప్రశ్నే.

అతి ప్రాచీన మానవుడు
పరిసర మృగశాబకముల రీతి
మానవజాతి శాబకమై
దోగాడుచు తిరుగుచుండిన వాడే,
కాళ్ళు చేతులు అను వ్యత్యాసము లేక
నాలుగు కాళ్ళు ఉపయోగించి
మోకాళ్ళమీద దోగాడిన వాడే.
శతాబ్దాలు గడిచాయి
ఎన్నడో శుభముహూర్తాన
వెన్నెముకను బలిష్ఠముచేసి
లేచి నిలుచొని తప్పటడుగులు వేశాడు
నడిచాడు, క్రమేణ పరుగు లిడినాడు.

ఆ ప్రాచీనస్థితిని స్మరణకు తెస్తూ
నేటికిని మానవకిశోరము
కదలికను దోగాడుటతోనే ప్రారంభిస్తాడు.
ఇతరములేమీ దోగాడవు
మానవశిశువే దోగాడి కదలికకు శ్రీకారం చుట్టాడు.
అతి ప్రాచీన ప్రాణస్థితిని
మన కండ్ల ఎదుట చిత్రిస్తాడు
ఆనాటి వాస్తవికతను నేటికిని స్మరణకు తెస్తాడు
బొమ్మగీసి చూపిస్తాడు
దోగాడేస్థితి జయంతిని
ప్రతి మానవ శిశువు జరుపుతుంటాడు.
పరిశీలించండి మన కాళ్ళకు
ఆనాడు దోగాడిన చేతులకు ఎంత సారూప్యమో
నిడువైన చేతులు హస్తాలు
నిడువైన కాళ్లు పాదాలు
ఐదువ్రేళ్లు గోరులు
బొటనవ్రేలు పెద్దది
మధ్యలో మడత పడుతుంది
ఒకవైపునే మడత పడుతుంది
ఇట్టి సారూప్యము ఏ ఇతర అవయవాలకులేదు
కేవలము యాదృచ్ఛికము కాదు
ఆ తొలినాటి చరిత్ర ఉంచుకొన్న
సారూప్య అవశేష స్మృతులు.

నడిచే పనినుండి చేతులు విముక్తిని పొందాయి.
చేతులు స్వేచ్ఛను పొందాయి.

నడచుట పరుగెత్తుట అను ప్రాథమిక కార్యమునుండి
చేతులు విడుదల పొందాయి.
హస్తాలకు గమన శాపవిమోచన జరిగింది.
హస్తాలు వివిధములైన కార్యాలను చేయ ప్రారంభించాయి.
దేవుళ్లు ఎప్పుడూ చతుర్భుజులే
లేచినడవడము, చేతులు పనిచేయడము
మానవతా వికాసములో పెద్దమలుపే
భిన్న భిన్న కార్యాలను నైపుణ్యముతో చేయుట
చేతులు నేర్చాయి
వేటాడుట, దున్నుట, వ్రాయుట మొదలు
చిన్న పెద్ద యంత్రాలను నడపుచున్నవి చేతులు
చంపుకొనే యుద్ధాలను చేయుచున్నవి చేతులు.
కాళ్ళ పనులే చేస్తుంటే
శిల్పఖండాలను చెక్కడం, వీణను వాయించడము
విమానాలను నడపడం సాధ్యముకాని పనే గదా!
పనులన్నీ మానవునికి దుస్సాధ్యములుగ ఉండేవి.
హస్తస్వేచ్ఛ మానవతా వికాసములో
పెద్ద విప్లవమని విశ్వసించాలె
ప్రగతికి ప్రథమ సోపానము.

దీనికి తోడు నీడగ
నోట మాటలు చిగిర్చాయి
సైగలతో నడుస్తున్న వ్యవహారాలు
పలుకులతో మొదలిడినాయి
సాహిత్యానికి సంగీతానికి
తొలి బీజాలు పడ్డాయి.

మాటలు లేక సాహిత్యము లేదు
మాటలు లేకున్నా
సంగీతము ఉత్పన్నము కావచ్చు
మాటలు స్వరాలు చేరితే
సమగ్రమైన సంగీతము
సహస్రాబ్దాల మలయ మారుతాలలో
బీజాలు అంకురాలై నిలిచాయి
లతలై వృక్షాలై పుష్పించి
రమ్యనందన వనమైనది
హస్తముద్రలతో, కనుచూపులతో
అంగవిన్యాసముతో పాదనటనా సహకారముతో
నృత్యము సాహిత్య సంగీతాలకు జనించింది
చేతులు నోరు ఎన్నో విజయాలను సాధించాయి
ఊహించని బాటలు చూపాయి
ఎత్తులకు ఎగిరాయి
ముందుకు నడుస్తున్న మానవునికి
దివిటీలయ్యాయి.
కాలానికి తీరిక ఎక్కువ, ఓరిమి ఎక్కువ
త్వరలో తన దళముల విప్పదు
కొన్ని శతాబ్దాలు మూగగా ఉంటుంది
కదలక మెదలక మోడై ఉంటుంది
హఠాత్తుగ మేల్కొని చిగిరిస్తుంది
కొంగ్రొత్తల ఒక్కసారిగ యివ్వదు
రహస్యాల పేటికను ఒకేసారిగ తెరువదు
భవిష్యత్తు సురంగముల
ఛేదించి ఛేదించి అన్వేషించాలె.

పనిచేసే శక్తి మాట్లాడే శక్తి
మానవుడు సంపాదించాడు
ఆ పెట్టుబడితోనే ప్రారంభించాడు
ఇప్పటికే అనల్ప సంపద గడించాడు
అనేక శక్తుల సహకారాన్ని పొందాడు
నిజమే చేతులులేని పిట్టలు కొన్ని
నేర్పుతో అందమైన గూడులు కట్టాయి
గిజగూడుల నిర్మించుకొన్నాయి.
ముక్కుతో కాళ్ళతో సామగ్రిని చేసికొని
గూళ్ళను గ్రుడ్డుల పెట్టుటకై కట్టాయి
స్వల్పమైన నైపుణ్యమునే చూపాయి
మార్పులు కూర్పులు లేని
పరిమిత దక్షతనే చూపాయి
అది కూడా కొన్ని పిట్టలు మాత్రమే
మానవుని సృష్టిపాటవమును
ఏదియు సమీపింపలేకున్నాయి
అదే ప్రకృతిలో మానవుని విశిష్టత.

క్రమేణ జ్ఞాపకశక్తిని అలవరచుకొన్నాడు
నిన్న మొన్న మాసము పూర్వము
జరిగిన ఉదంతాల జ్ఞప్తి ఉంచుకొన్నాడు
చెప్పినమాటలు విన్నమాటలు
స్మరణ పేటికలో దాచుకొన్నాడు
జ్ఞాపకశక్తి పరిమితముగా
కొన్ని జంతువులకు పక్షులకు సంక్రమించింది
సైబీరియా కొంగలు శీతాకాలములో

వేలమైళ్లు ఎగిరి ఉష్ణదేశములచేరి
శీతాకాలము పోగానే త్రోవను గుర్తించి
స్వస్థానములకు చేర్తాయి.
కపోతములు చీటీల కొనిపోయి
జవాబు చీటీలతో బయలుదేరిన
ఇంటికే వచ్చి వ్రాల్తాయి.
పోలీసు కుక్కలు వాసనను గుర్తుపట్టి
దొంగలు వెళ్ళిన దారిని అనుసరిస్తాయి

ఆఘ్రాణశక్తి వీక్షణశక్తి శ్రవణశక్తితో
పరిమిత పథమున మానవాతీతమైన శక్తిని
కొన్ని పక్షులు జంతువులు సంపాదించాయి
దూరవస్తువుల పసిగట్టగల శక్తి
పులులకు కుక్కలకు కలదు
దూరమున ఉన్నవానిని చూచే శక్తి
గద్దలకు కలదు
వినేశక్తి చీకటిలో చూచేశక్తి
కొన్నింటికి కలవు
కొన్ని విషయాల్లో మానవుడిని దాటి
ముందుకు చనినాయి
కాని, స్వల్ప పరిధిలోనే ఈ అధికశక్తి

అయినా, జ్ఞాపకశక్తితో మానవుడు
చాలా పురోగమించాడు
అక్షరాలు గుర్తించి పుస్తకాలు వ్రాశాడు

ఇతర గ్రంథాలు చదివి
జ్ఞాపకముంచుకొన్నాడు
ఎన్నడో జరిగిన విషయ వర్ణన
పూర్వకవిత్రాయ జ్ఞాపకముంచుకొని
శిష్యులకు పాఠము చెప్పాడు
అవధానాదులలో జ్ఞాపకశక్తి
పరాకాష్ఠను పొందింది
ధారణాశక్తితో వేలపద్యాలు వల్లించాడు
గత ఉదంతాల వివరాలను చెప్పి
జంగమ విజ్ఞాన సర్వస్వ మని ప్రసిద్ధికెక్కిన
వారూ అటనట కానిపిస్తుంటారు

జ్ఞాపకశక్తి బలిమితో
గత అనుభవాల సాయముతో
వర్తమానాన్ని వీక్షించాడు
నికట భవిష్యత్తు స్వరూపాన్ని
కొంత వరకు ఊహించ గలిగాడు
గ్రహాల గమన స్థితినిగమనించి
గ్రహణాలు ఎప్పుడో మూఢమి లెప్పుడో
స్పష్టముగ లెక్కవేశాడు
గాలివానల రాకలను ఊహించాడు
మానవుని పురోగమన చరిత్రలో
జ్ఞాపకశక్తి కీలకస్థానాన్ని ఆక్రమించింది
మెదడున చేరి అన్నింటికి కేంద్రమై వ్యవహరించింది
ఆలోచించుటకు ఊహించుటకు బాటల తీర్చింది
చేతుల విడుదల మాట్లాడు శక్తి

జ్ఞాపకశక్తి మనిషిని మార్చె
సర్వోన్నతుని చేశాయి
శిశువు నడవలేక చెప్పలేక
జ్ఞాపకశక్తిలేక, తొలినాటి మానవుని
స్వల్ప ప్రతీకగా ఉన్నాడు

ఎప్పుడో నిప్పును పుట్టించడము
నేర్చాడు, వంటల చేశాడు రుచులనేర్చాడు
కొయ్యలకట్టి తెప్పల కట్టాడు
నీళ్లను దాటేశక్తిని పొందాడు
సముద్రపు లోతుల గెలిచాడు
పరదేశాలకు చనినాడు సంఘర్షణ పడ్డాడు
కయ్యాలకు కాలుదువ్వాడు
బల్లాలు ఈటెలు కత్తులు చేశాడు
బాణాలు విసిరి చంపాడు
చక్రాన్ని ఊహించి గమనానికి
వడివి చేర్చాడు
కాలగమనములో వేల ఏండ్లకు
ఒక అడుగు జరుగుతు ప్రాకుచు
ప్రగతి పథంలో సాగాడు
స్తబ్ధముగా ఎన్నడు లేడు
కనబడని కదలిక, కానిపించని పెరుగుదల

ఇటీవల శతాబ్దాలలో
విజ్ఞానశక ప్రారంభము ఆవిరి యంత్రము

విద్యుత్‌శక్తి, రేడియో విమానాలు
మానవ వికాసాన్ని విశదపరిచాయి
అణువులో దాగిన నరసింహావతారము
భీతిని కొల్పింది. మారణజ్వాలలు
దిగంతకోణాలలో రక్తఅరుణిమను
చూపుచునే ఉన్నవి
అదీ నేటి ఆనందస్థితి విషాదస్థితి
ఇరువదవ శతాబ్దపు సింహావలోకనములో
మానవుడు ఎంత ముందుకు సాగాడో
తెలుస్తున్నది. చంద్రునిపై కాలిడి వచ్చాడు.
కారడవులుగా నున్న ఖండాలు
మానవ కలరవములతో ముఖరితమయ్యాయి.
ఉన్నతశిఖరాలు శీతలదేశాలు సముద్రగర్భాలు
అన్వేషణా సాహసాలకు లొంగాయి.

ఇక్కడ ఆగుతాడా మానవుడు
మానవ శతపత్రం అన్ని దళముల విచ్చిందా !
గమ్యస్థానం చేరిందా ?
కాదు, కాదు, కాదు.
ముందు ఎంతో భవిష్యత్తు ఉన్నది.
ఉజ్వలమైనది, ఉత్సాహాన్నిచ్చేది,
శతసహస్రాబ్దాలు పోవాలె.
అప్పుడే తెరచాపలు దింపి
తెడ్డులు పారవేస్తే ఎట్లా?
వ్యక్తులు మాయమగుతారు.
శకాలు మార్తాయి.

వినాశ సమరాలు జరుగుతాయి.
ఇవి స్వల్ప ఉదంతాలు.
మూలతత్వము మారి
లోహాన్ని బంగారుగ మారాలె
మానవుడు మహామానవుడు కావాలె
దివ్య మానవుడు కావాలె
అమృత పుత్రుడు కావాలె
గత వికాసాన్ని గమనిస్తే
ముందు జరుగనున్నది ఊహించొచ్చు
అధిగమించవలసిన శైల శిఖరాలు
ఇంకా ఉన్నవి మానవ గరుత్మంతునికి
ప్రగతి నక్షత్రము తూర్పు దిక్కుననే ఉన్నది
పడమటి దిక్కుకు వాలలేదు.
మానస కోకిల అన్ని ఋతువుల పాడుటలేదు
పాడే సమయము వస్తుంది.

అనూహ్యమైన మానవ యాత్ర
ఎన్ని చిత్రవిచిత్ర వీధికలు చూస్తూ
విజయ పతాకాలతో పోతుందో
ఎన్ని రమ్య మధుర గీతా స్వరముల వింటూ పోతాడో
భూ సురంగములలో నిద్రించే వసు సంపద తెస్తాడో
సముద్ర అగాధాలను చేరి
నృత్యము సల్పే పాతాళ కన్యల
మంజీర నిక్వణాలను వింటాడో !
ఇవి భౌతిక విజయాలు కావచ్చు
అది చాలదు మానవునికి

బాహ్య సంపదల వైభవాలతో సంతుష్టిచెందడు
అంతరనిహితమైన దీర్ఘతృష్ణ తీరదు.
అగోచరమైన ఆధ్యాత్మిక శాంతికై
మౌనముగ వెదకుచునుంటాడు.
సంఘములో వసిస్తూ ఏకాంత హర్మ్యాలకు
చొచ్చుకపోతాడు
అలౌకిక ఆనందస్వాదముల చవిచూస్తూ ఉంటాడు.

ఎప్పుడో ఒక్కొక్క తరుణమున
అజ్ఞాత ఆనందలహరులు
హృదయ కాసారమున సోక
అరనిముషమో, నిమిషమో
అపూర్వ ఉత్సాహ సంచలన కలిగించి
సంతోషతరంగములపై ఓలలాడిస్తుంది
మెరపువలె మెరిసే ఆనందకిరణము ఎక్కడిది?
ఎందులకై వచ్చింది, క్షణప్రభయై
వెలిగి అంతర్థానమైనది?
అది రానున్న కాలాల ఆనందతరుణాల
మార్గసూచిక.
జటిల సమస్యాభాజనుడైన మానవునికి
భావిదిగంతాల కాన్పించే ఆశాకిరణము.
అనేక మజిలీల దాటుకొని
చేరబోయే గమ్యస్థానమును చూపు సాంత్వనవాక్కు
ఆశలు, ఓదార్పులు, వాగ్దానాల నిరీక్షణలు
అవసరము మానవ హృదయానికి
నిరాశాహతుడై క్రుంగిపోక నిలువడానికి

తెప్పరిల్లి ముందుకు సాగడానికి.
విస్తరరూపమున ఉన్న
దయాళువు ప్రకృతి హృదయము.
ఒక్కసారిగ అన్ని రహస్య సంతోషములను ప్రకటించదు.
ఓపికను సహించాలె
నెమ్మది నెమ్మదిగా కొద్దికొద్దిగా
ఇస్తుంది కొంగుముడిలోని కాసులు.
అల్ప జీవుల తొందరలు ఆమె సహించదు
అనంతకాలముంది ఆమె కాల పథము
సహస్రాబ్దములకు ఒక ఫర్లాంగురాయి
ఆమెకు ఏండ్లకు తొందరలు ?

కాల పయనిన యాత్రలో
అనిమిషపు హర్ష పులక
ఐదు నిమిషాలు ఉన్నచో, అర ఘంట ఉన్న
ఎట్లా ఉంటుంది ?
ఆలోకానందముతో ఎంత ఉత్సాహముగా ఉంటుంది !
అట్టి ఆనందము మానవుని నొసటి వ్రాతలో లేదా ?
అతని సౌభాగ్య ద్వారములకు
అందని గంతులిదే స్వర్ణ హరిణమా ?
అర్ధ ఘంట ఎందులకు ?
ఘంటలు దినములు
దివ్య మానవ హర్ష తేజముతో ఉండగలడు
అలౌకిక ఆనందామృతమును
పానముచేసి బ్రహ్మత్వమునకు
చేరువగా చేరగలడు.

అట్టి దివ్యత్వమును పొందిన మానవుడు
సమీక్షా దృష్టితో సింహావలోకనము చేసినపుడు
ఎంతటి విస్మయ మతనికి?
ఎంతటి మహదానంద మతనికి!
ఎన్నడో ఎక్కడో బయలుదేరిన మానవుడు
ఎంత కాల దూరాన్ని పయనించి
ఎన్ని లోతు కడలుల, ఎన్ని కొండ వరుసల
దాటుకొని వచ్చాడో ఊహించగలడు.

దివ్య తేజముతో ప్రకాశించాలె
దివ్యధామములో మనాలె
దివ్యత్వము నిత్య సహజీవనము కావాలె.
అది మానవుడు చేరగలిగిన రేవే
అదే భావి యుగాల ఆమంత్రణ
అప్పుడు అహంబ్రహ్మయని నిజముగ చెప్పగలడు.
మన దూర మానవ వారసుడు.
అదే మానవోదయం
దివ్య మానవోదయం
దివ్య నవోదయం.

17-6-84
నెల్లూరు

# మానవ పాటవము

ఏనుగుకన్నా, సింహానికన్నా
హంసకన్నా, కోకిలకన్నా
ఉన్నతముగా అధిష్ఠించాడు మానవుడు
నీ సృష్టిలో అన్నిటిపైన అధికారాన్ని చెలాయిస్తున్నాడు
నీవు కృపారసముల అతనిపై నిండుగా చిలికావు
నీ ప్రతిరూపుగా తయారుచేశావా?
యువరాజ పట్టాభిషేకము చేశావా?
నీ ఆశీస్సుల పూర్తిగా పొందే వచ్చాడు
నడచుట నేర్చాడు, పలుకుట నేర్చాడు
జ్ఞాపకాలు దాచుకొన్నాడు
ఆలోచించాడు, ఊహించాడు
మేధావి అయ్యాడు, నేర్పరి అయ్యాడు
దున్ని ఆహారము పండించాడు
చెక్కి శిలాఖండాల సృష్టించాడు
పాడి మధుర సంగీతాన్ని పుట్టించాడు
వ్రాసి అమర కావ్యాలు లోకానికి ఇచ్చాడు
నీవు ఇచ్చినదానికన్న ఎక్కువే ఇచ్చాడు

నీవు మహత్తరమైన అందాలు సృష్టించావు
ప్రతివృక్షము, ప్రతిపుష్పము
నీ కళాచతురిమను చూపేవే.

సూర్యాస్తమానాలు, చంద్రోదయాలు
గ్రహాల నృత్య పరిభ్రమణాలు
ప్రకృతి ఎంత సౌందర్య ప్రియో చూపేవే.
నీ వానలు, మెరుపులు, ఇంద్రధనుస్సులు
తుపానులు ఉప్పెనలు
నీ పాటవత్వాన్ని చూపేవే, శక్తిని చూపేవే
మానవుడు నిన్ను అనుకరిస్తాడు
నీ అందాల జాడలలో నడుస్తాడు
చూపిన మార్గాన వెళతాడు
విస్మయాన్ని కల్పించే, కుశలతను
ప్రాప్తించు కొంటాడు.
**తెలివి తేటల నిచ్చావు**, అందాల మెచ్చే గుణాన్ని ఇచ్చావు.
నేర్పరితనమును ఇచ్చావు
క్రొత్తను పుట్టించే శక్తిని ఇచ్చావు.
మాటల నిచ్చావు, కవనము అల్లాడు
గొంతు నిచ్చావు, పాటల నిచ్చాడు.
గుండెను ఇచ్చావు, ప్రేమ సుధను చిలికాడు
స్త్రీని ఇచ్చావు, వేషభూషలతో అలంకరించాడు
శిల్పకేంద్రము చేశాడు, కళాక్షేత్రము చేశాడు
బిడ్డను ఇచ్చావు, పెంచి పెద్ద చేశాడు
రోగాల నిచ్చావు, మందుల వాడాడు
చీకట్లను ఇచ్చావు, దీపాలను పెట్టాడు
విషము నిచ్చావు, విరుగుడుగా మార్చాడు
వేరు చేసే సముద్రాల నిచ్చావు
కలిపే ఓడల నడిపాడు
నిప్పును రాజేశావు

వంటల నేర్చి, రుచుల పెంచాడు
దూదిని ఇచ్చావు, బట్టల నేశాడు
బంగారు నిచ్చావు, నగలతో అలంకరించాడు
రాళ్లను ఇచ్చావు, శిల్ప ఖండాలుగ మలిచాడు
నీ అడుగులకు గజ్జెల తొడిగాడు
నీ వెదుళ్ళకు స్వరాలనిచ్చాడు
లోయలలోని నీళ్ళను
మెట్టలకు పారించాడు
మృగాలకు కోరలు గోళ్ళు ఇచ్చావు
మానవుడు భల్లాలను, బాణాలను చేశాడు
గమనాన్ని నృత్యముగ మార్చాడు.
నీవు పరవలనిస్తే, అతడు యుద్ధాలనిచ్చాడు
అగ్నిపర్వత జ్వాలలనిస్తే
అతడు అణుశక్తి దహనాలనిచ్చాడు
అవసరమైతే దానవుడవుతాడు
అవసరమయితే దేవతయగుతాడు
పొందిన దానికన్న, ఎక్కువే ఇచ్చాడు
మానవుడు నీ సర్వశ్రేష్ఠమగు
నైపుణ్య పుణ్యరాశి

మానవుడు సామాన్యుడు కాడు
నీ అల్పప్రతిరూపుగా, ప్రేమ పాత్రుడుగా
నిర్మించావా? అతని బుద్ధి వికసిస్తున్నది
కౌశలం కోరకము కన్నుల విప్పుచున్నది
ఎముక లేకనే పెరుగుచున్నాడు
ముందుకు చనుచున్నాడు

ఆటంక కంటకముల లెక్కచేయక
పయనించుచున్నాడు
కాలపథములో నిత్యయాత్రికుడు
దీక్షతో ఎన్నో తీర్థముల చేరుచున్నాడు
ఓపికతో, నేర్పుతో పయనిస్తున్నాడు
చావుతో లంగరు దింపుతాడు
అది వ్యక్తులకే. మానవజాతికి కాదు.
వేకువనే లంగరు ఎత్తి, ప్రయాణము సాగిస్తాడు

అగోచరమగు నీ వృక్షమును చుట్టి
మానవలత పైకి ప్రాకుచున్నది
లత లతాంతముల ప్రస్ఫుటించి
దివ్య సౌరభముల ప్రసరించినపుడు
అలౌకికానందమే కలుగగలదు
శుక్లపక్ష చంద్రుడు పశ్చిమదిశన
ఉదయించి పూర్వదిశకు ప్రాకుచు
పూర్ణిమనాడు పదహారు కళలతో
ప్రకాశించినపుడు, ఎంతటి ఆహ్లాదము!
భూమ్యాకాశములు
శ్రీగంధపు పూతలు అలమియుండగలవు
మానవ పూర్ణిమ ఆసన్నమవుతుంది

యౌవన వల్లరి
దేహ తరువుల ఆవరించిననాడు
ఎంత శోభాయమానముగ నుండగలదు
దానికై త్వరపడుట వ్యర్థమౌతుంది
శుభతరుణమునకు వేచి ఉండాలి

ఎలప్రాయపు వికాసాలు రాగలవు
అవి దాగలేవు
నిన్ను అనుగమిస్తు, నైపుణ్యమును
వినియోగిస్తు అధిగమించుచున్నాడు
నీ అదృశ్యమహత్తు అతనిద్వారా
ప్రకటితమవుతుంది
నీ గుప్త ప్రసూన పరిమళములు
అతని కుశల భుజాలపై
ఆరోహించి వ్యాపించుచున్నవి

నీవు మూల విరాట్టువు
నీ సృష్టియైన ప్రకృతి
మానవ గరుడ వాహనముపై ఊరేగి
అందరికి పరిచయ మగుచున్నది
నీ ప్రతిరూపే అతని రూపు
నీ ప్రసాద నైపుణ్యమే, అతని పుణ్యసిద్ధి
కలిగిన దానికన్న, ఎక్కువ సొంపుల చేర్చి
అందాలనిచ్చాడు

ప్రకృతి నీ క్రీడాభూమి
మానవుడు నీ ఆటల జంట, చెలికాడు
ఎప్పుడో భవిష్యత్తులో నీ దగ్గర చేరగలడు
చేయి అందించి పైకి చేదుకొనుము
అతని ఉన్నతి నీ మహిమ కాగలదు

31-7-84
నెల్లూరు.

# సన్మాన పత్రము

అనుదినము నీ పేరుతో
నిన్ను పిలుచుచున్నాను.
చారు అని పిలిచేవాడిని
హఠాత్తుగా ఇంకేదైన పేరుతో
పిలవాలని కోరాను.
సన్మానించాలని కోరాను.
స్వర్ణయుగములో ప్రేమికులు
పరస్పరము పిలుచుకొనినట్లు.
సుఖమైన సన్మాన సంబోధన
'ప్రియతమా' అని
మౌనముగ క్రొత్తపేరును మనస్సులో వల్లెవేసుకొన్నాను
జవాబుగ నీవు పెద్దగ
నవ్వుట విన్నాను-మనస్సులోనే.
మౌన సరస మందస్మితములు
ఈ కాలానికి ఉపయుక్తముకావని గ్రహించాను
ఇది అవంతి, ఉజ్జయినికాదు కాబట్టి

ప్రతి దినము పిలిచే పేరులో తప్పేమి
అనేదే నీ ప్రశ్న.
అయితే చెప్తాను విను
పని తేలికగా ఉండింది
త్వరగా ఇంటికి వచ్చేశాను

నేడు నేను తొలిసారిగా గమనించాను
స్వల్పాదాయాల ఈ మనిషికొరకు
అలవాటైన పనిపాటలుచేసే నా వధువు
ప్రతి దినము నూతన మనోహర అలంకారాల
చేయుచున్నది.
ప్రతి దినము నేను చూచే 'చారు' కాదు ఈమె
ఇంకొక కాలపు అవంతిక అతివ
ఈ రీతిగ కాన్పించేదేమో!
ప్రేమ విస్మితనేత్రములకు ఇంపును కొల్పుచు
శోభాయమానముగా అలంకరించేదేమో!
అమరుక శ్లోక చతుర్థపాదాలలో
శిఖరిణి స్రగ్ధర గణములలో
సొగసుగా అమరేదేమో!
అలంకారాల గదినుండి కూర్చునేగదికి
అభిసారికయై వచ్చేదేమో
వర్తమాన యుగమునకు వచ్చినది కాబోలు
భూతకాల సందేశములతో.

తోటలోనికి వెడలాను
నేడు నా మనోహరిని
సన్మానింప నిశ్చయించాను.
కళాత్మకమైన సన్మానముతో.
నిన్ను నేను నా గదిలోనికి
ఆహ్వానించినపుడు
యథారీతిగా స్వాగత సన్మాన పత్రికవలె నుండును
నా ఎదుటనున్న తీగె
తెల్లని పువ్వులతో నిండియుండును.
నాకు జ్ఞప్తిలేని ఏదో విదేశీ నామముతో
విలసించియుండును.

తారాధార అని దానికి నామకరణము చేశాను
నిశీధములలో దాని సౌరభాలు
ప్రమదావన ప్రమత్తాలాపనాలవలె ఉంటాయి
అకాలములో అవి వికసించాయి
శీతాకాల సమాప్తికి వేచియుండలేదు
దాని పూగుత్తుల నీకై తెచ్చాను
సువాసనలే చేవ్రాలై
నా కానుకను సమర్థించగలవు
ఈ శుభసంధ్యాకాలమున
నీవు పౌరాణికయుగ చారు ప్రభవు
నేను ఆ కాలాల అజిత్‌కుమారుడను
నేడు నేను కొద్ది మాటల పలికెదను
వాని పదముల సప్రయత్నముగా కూర్చుకొన్నాను
ఇష్టమైతే నీవు నవ్వుకోవచ్చును
నా మనస్సుతో ఆ పదముల కూర్చుకొన్నాను
నీ శిరోజాల వేణిని నీవు కూర్చుకొన్నట్లు

ప్రియతమా, ఈ విదేశీ పుష్పగుచ్ఛాలు
వసంతయామినికై
ఆకసమున వెదకుచుండినవి
జాలిగొని వానిని నీకడకు తెచ్చితిని
నీ [illegible] తలముల అలంకరించుటకు
అని [illegible] పదముల పఠించి
సమర్పించితిని.

రవీంద్రుని
'ఫ్యుజిటివ్' నుండి
మాతృ[illegible], మే 1936.

అనువాదము
ఇంగ్లీషు నుండి
21-7-1984.

# చింతపూత

రాత్రి అంతయు అవిరళముగా వర్షించెను
ప్రభాత వేళ ఆకాశము
త్రాగుబోతువాని కన్నువన్నెను వహించెను
లక్ష్య రహితములై ఉన్మత్త వాయువులు వీచినవి
కాన్పించని పంజరమున
ధరణినంతయు బంధించి
బ్రహ్మాండమైన పక్షి
అన్ని వైపుల రెక్కల
అతిశక్తివంతముగ మోదుచున్నదా
వీథులు నీళ్ళల్లో మునిగినవి
ప్రాంగణము జలప్లావితము

వరండానుండి ఆ చింతచెట్టును చూచాను
కోపోద్రిక్తుడైన సన్యాసి
ఆకసమువైపు శిరమును ఎత్తి
సమస్త శాఖలతో శపించుచున్నాడా!
సందు ఇరుప్రక్కలనున్న
ఇటుకరాళ్ళ ఇళ్ళు నిస్సహాయముగనున్నవి
గగన దౌర్జన్యమునకు
వానికడ ధిక్కార తిరస్కార పదములు లేవు
ఆ వృక్షపర్ణ ఆందోళనములలో మాత్రము

తిరుగుబాటు సంకేతచిహ్నములు
విరివిగా కాన్పించెను.
విస్తారమైన ఇటికల కలపల
మూక జనత్వరాసుల మధ్య
శాసనోల్లంఘన శాపనిందా ధిక్కారాలు
చెట్లలో కాన్పించెను.

అరణ్యముల ఏకైక ప్రతినిధిగా
ఒంటరిగా నిలిచియుండెను ఆ వృక్షము
వర్షాపాండుర దిగంతములలో
ఆనాడు ఆ వృక్ష ఆందోళితా శోభావైభవాన్ని చూచాను.
వీచికల మీద వీచికలై
వసంతసమీరములు రాగా
అశోక వకుళవృక్షముల
ఆదరముల పొందినవి
ఋతురాజు బహిర్ద్వారము కడ
నిర్లక్ష్యముగా సగర్వముగా నిలిచిన
ద్వారపాలకునివలె నాకు తెలియును అది.
అప్పుడు ఎవరు తలచిరి
మొరటు బెరడులలో
సౌందర్య సౌకుమార్య మున్నదని.
వసంతుని సభామండపములో
దాని గర్వకారణమైన
వంశ ఇతిహాసము గొప్పదని.
నేడు దానిని దాని పూతతో
పరిచయము చేసికొన్నపుడు విస్మయము కలిగించెను.

నందనవనచ్ఛాయలలో
కాసారతీరమున తన పాటల
అభ్యసించుచు కూనురాగముల తీయు
గంధర్వ చిత్రరథుడు
అర్జునుని మెప్పు వడసిన మహావీరుడని
తెలిసినప్పటి వింతవలె.
ఆనాటి యువకవి కన్నులకు
ఆ వృద్ధవృక్షపు రహస్య సౌందర్యమత్తత
శుభతరుణమున బహిర్గతమైయుండినచో
ఆహ్లాదదిన తరుణ ఉదయమున
మధుపముల రెక్కలు
సంతోష సంభ్రాంతములైనవేళ
ఆ పూతల గుత్తిని ప్రుచ్చిలించి
వణకుచున్న వ్రేళ్ళతో
ఆనంద అరుణరంజితము లగుచున్న
నీ కర్ణమూలముల ఉంచెడివాడని
తలచుచున్నాను.
అవి ఏమిటని నీవు ప్రశ్నించిన
నీ కపోతములపై పడుచున్న
సూర్యరశ్మి లేశమునకు
నీ అధరములు పేరిడిన
ఆ పేరునే ఈ పూగుత్తికి కూడా
ఇయ్యగలడని ఊహించుచున్నాను.

అనువాదము
ఇంగ్లీషు నుండి
22-7-84,
నెల్లూరు

రవీంద్రుని
'శ్యామలి' నుండి

# ఎలప్రాయము

బాలిక అపహాస్యముల అవమానముల
తీపిని అనుభవించే ప్రాయము
నాకు ఇంకా దూరముగానే ఉన్నది.

*        *        *

ఇంతలో జీవితపు వేదిక మీద
మా వేషాలు దుస్తులు మారాయి.
ఆమె చీర కట్టుటకు ఆరంభించినది
భుజముమీద చీర అంచును
బ్రోచ్‌తో బిగించినది.
వేణిని చుట్టి కబరిని ఆధునికశైలిలో
అమర్చింది
నేను కాకీషరాయిని ఆటల చొక్కాను
వేయ ఆరంభించాను.
అంతరంగములో
మా భావాలు ఉద్వేగాలు కూడా
మారుచు వచ్చాయి.
వాని సాక్ష్యములు కొంత
దాచుచునే ఉండినవి

*        *        *

అనుదినము మేము
పెద్ద అగుచునే వచ్చాము
మా ఇద్దరికి ఎరుకలేకనే జరిగింది
దానికి మేము బాధ్యులము కాము
ఆ పెరుగుట అపరాధమైనదని
నేను గుర్తించలేదు.
ఆమె తండ్రి గుర్తించాడు

రవీంద్రుని
'శ్యామలి' నుండి

కొన్ని భాగాలు, ఇంగ్లీషు
నుండి 22-7-84
నెల్లూరు

# విచికలు-1

1. అంబర విహారముచేసే విహంగాన్ని
వనములో బంధిస్తే ఎట్లా?
నా రెక్కలకు చాలదు తోట
ప్రపంచమే సంకుచితమైనట్లు ఉంటుంది

2. మధుపాలకు ఏమి తెలుసు
వన సౌందర్యము, సౌరభము?
పుష్పము నుండి పుష్పమునకు
ఎగిరి సంతృప్తి పడేవి.

3. సాగర తరంగాన్ని
కాసారములో వదలిన ఏమౌతుంది
గమన శక్తిని పోగొట్టుకొని
నిర్జీవమౌతుంది.

4. ఖడ్గాన్ని కత్తిఒరలో దాచ యత్నిస్తే
ఒర చినిగిపోయి
నిరుపయోగమవుతుంది
వటవృక్షాన్ని తొట్టిలో
నాటినట్లగుతుంది.

5. మహాకావ్యములోని
మహాస్రగ్ధరను
భావకవిత్వములోని
తేటగీతిని కాను.

6. నేను విశ్వభారతివాడిని
ఏ తెలుగునాటికో
నెల్లూరుసీమకో
అంటించి ఇరికిస్తే ఎట్లా?

7. వనాన్నంతా హర్షభరితము
చేయగల సుగంధాన్ని
ఒక చెట్టుకో ఒక పువ్వుకో
పరిమితము చేయుట పాడియా

8. సహస్ర సహస్రాబ్దాల
మానవోదయాన్ని చూస్తాను
ఒక వారము ఒక మాసము చాలదు
మనశ్శరీరాలు బిగుసుకపోతాయి.

9. పిడుగులతో తుఫానులతో
భాషించేవాడిని
చెవిలో గుసగుసలతో
పలుకరిస్తే ఎట్లా.

10. మిన్నుల బుగ్గల ముద్దిడే
శైలశృంగాలమీద నా విడిది
పిచ్చుకలతో పందాలాడుట
నాకు తగిన ఆట కానేరదు.

11. సముద్రతరంగాలలో దుమికి
అగాధాలను చేరి
మౌక్తికాలను తెచ్చేవానికి
ఒడ్డున కూర్చుని గుల్లల ఏరుట
పిరికివాని పనిగా ఉంటుంది.

12. ఆకాశాన్ని పులకిత మొనర్చే
ఇంద్రధనుస్సును
ఉన్నతంగానే ఉంచాలె.
అడవి జింకల వేటాడుటకు
ఉపయుక్తము కానేరదు.

13. వయస్సు హెచ్చేకొలది
కాలము విలువ హెచ్చుతుంది
శేషించిన కాలము తగ్గుచు వస్తుంది
కాని విలువైన కాలము
అనారోగ్యపు ఆందోళనలతో
నష్టమైపోతుంది.

14. ఎల్లలు కంచలులేని ఎడారిని
మూరలతో కొలుస్తామా?
రెండు రాత్రుల
ఒంటెల ప్రయాణమంటాము.

15. దూరాన్ని కాలంతో కొలుస్తాము
మద్రాసుకు నెల్లూరు
మూడు ఘంటల దూరమంటాము
ఖగోళములో అన్నీ
కాంతి సంవత్సరాల దూరమే.

2-7-84
నెల్లూరు

# స్పీడ్ బ్రేకర్లు

గమనానికి కావాలి వేగం
వేగానికి కావాలి నిరోధకాలు
కాబట్టి బ్రేకులు సరిగా ఉండాలి.
ఇంజన్ లాగడానికి, బ్రేకులు నిలుపడానికి
హెచ్చరికలు నిషేధాలు వృథాకాగా
రాజమార్గాలలో వాహనాలు
అతివేగంగా పోకుండా
స్పీడ్ బ్రేకర్లు అటనట నిర్మించారు.
నిదానంగా పొమ్మని గట్టి హెచ్చరిక.
జనులు తిరుగుతుంటారు
పిల్లలు ఆడుచుంటారు
చూసి జాగ్రత్తగా పొండని బాట ఆనతి.
కాలము విలువైనది
జీవితము ఇంకా విలువైనది
ఎటువంటి ప్రమాదము లేకుండా
ఆలస్యపు పయనం శ్రేయమని హెచ్చరిక
లారీలు బస్సులు ఎక్కువైన పిదప
రోడ్లు వెడల్పైన పిదప
రోడ్డు ప్రమాదాలు అధికమగుచున్నాయి
ప్రతివానికి తొందర ఎక్కువ

ఓరిమి తక్కువ
త్వరగా చేరాలని ఆసక్తి.

వేగమేకాదు, ధృతవేగం అధికమయ్యింది
గుర్రాలకు కళ్ళాలవలె లారీలకు
అధికగతి నిరోధకాలు నిర్మించారు.
నది వరదలకు ఎత్తైన డాంలు, తటాకాలు
నిర్మించారు.
పొర్లిపారకుండా గట్టుల కట్టారు.
ఎడారులు ఎగబ్రాకకుండా
చెట్లను నాటారు, అడవుల పెంచారు
అతివేగాలకు విరుగుడు కావాలె
ఆందోళన పుట్టించే ఉద్యమాలకు
నిషేధాజ్ఞలు అవసరమయ్యాయి.

పొలాలకు గట్టులు
దేశాలకు ఎల్లల గీచారు.
పరిమితుల నియమించారు
సరిహద్దుల అమలుపరచారు.
ఆశల ఎత్తులకు నిరాశల కప్పలు ఉన్నాయి.
ఆరోగ్యానికి వ్యాధులు
గెలుపులకు ఓటములు
వెంబడిస్తూనే ఉన్నాయి.

శబ్దతరంగాలు అతివేగంగా
ప్రసరిస్తే అర్థముకాదు
కాంతి ఎక్కువైతే, కళ్ళు చెదర్తాయి.
వాసన ఎక్కువైతే తల నొప్పివేస్తుంది
తీపి ఎక్కువైతే వెగటుగుతుంది
దేహాలలోనే సహజనిరోధకాలున్నాయి
జడ ప్రపంచంలోనే
అదుపు వస్తుంది.
అంధకారానికి విరుగుడు అరుణోదయం
పున్నమి చంద్రుడికి కృష్ణపక్షమే విరుగుడు
ప్రకృతిలో దాగియున్నవి
సహజమైన విరుగుడు సామాన్లు
సమరాలకు విరుగుడు శాంతి దౌత్యాలు
చివరకు జీవనలీలలకు
మరణమే స్పీడ్ బ్రేకరు.
అనూహ్యమైన వేగముతో తిరిగే
ప్రపంచానికి ప్రళయమే స్పీడ్ బ్రేకరు.

8-[illegible]-81
నెల్లూరు

# నెరజాణ

సదస్సులో నెరజాణ ప్రస్తావన వచ్చింది
నెల్లూరి నెరజాణ అని
అప్రయత్నముగ శబ్దం వినవచ్చింది
నెల్లూరి నెరజాణ అను పదబంధము
చిన్ననాటి నుండి వింటున్నాము.
సభా ముఖాన్ని వికసింపజేసింది ఆ మాట
నిద్రాణములైన శృంగార భావములు
ఉద్రేక కల్పనలు మేల్కొని రెక్కలు విప్పాయి
నెరజాణ మాటలోనే ఇంద్రజాలపు మత్తు ఉన్నదా
విప్పారిన ముఖముతో
ఎందుకు అందరు సంతోషభరితులైనారు
నిగూఢ శృంగార కల్పనల పర్దా వెనుక
ఏదో నేర్పరితనమో, గడుసుతనమో
చాకచక్యమో దాగియున్నవేమో!

ఏ పూర్వ శతాబ్దములో
ఏ రసోద్దీపిత సన్నివేశములో పుట్టిందో
ఏ సరసుడు, ఏ రసికుడు, ఏ కవి
అర్ధనిమీలిత నేత్రాలతో
తన్మయత్వ హృదయముతో అన్న పలుకులో

దేశసంచారి, పరప్రాంతపు యాత్రికుడే
ఇచ్చిన బిరుదై ఉంటుంది.
నెల్లూరికి శాశ్వతమైన గౌరవాన్నే ఇచ్చాడు
ఇతర జిల్లాలకు ఇట్టి బిరుదు ప్రదానాలున్నాయా

నెల్లూరి కీర్తి పతాకముపై
నెరజాణ నవ్వుచు నిలిచింది
తరగని కాంతితో, చెరగని నవ్వుతో
విందు నేర్పరితనముతో గుండెను ఆకట్టుకొన్న
సుందరి ఎవతో
ఆమె వ్యక్తియా, సామూహిక ప్రతీకయా
కాలపు చీకట్లలో కలిసిపోయిన రూపా
ఆమె ప్రతిరూపులు శేషించి
వర్తమాన సమాజవేదికపైన నడయాడుచున్నారా
సినిమా ప్రాంగణాలలో
మందిర మండపాలలో
అందియల సవ్వడులు వినబడుతాయా
శతాబ్దాల ఎడారిలో ఇంకిపోయిన అందాలవాగా
అమరవాహినియై
శోధాధారయై ప్రవహించుచున్నదా
ఆమె ఇతిహాసము మాయాతమస్సులలో
నిగూఢచ్ఛన్నమై అగోచరముగానే ఉన్నది
చేతికి అందక
ఊహాహస్తములకే చిక్కేదా
స్వప్నసుందరియా, స్వర్ణహరిణమా
గతకాలాల ముసుగులనుండి

అస్పష్టముగ వినబడే గుసగుసలా
నవ్వుపొంగులా

మనుమసిద్ధి దర్బారులో
ఆమె నృత్య హేలా విలాసముల చూపిందా
తిక్కన చిత్రించిన సైరంధ్రీ రూపాంతరమా,
ఆధునికీకరణమా
కేతన దశకుమారులతో
జూదములాడిందా
శతాబ్దాల శృంగార మంజరిగ వచ్చింది
ఉల్లాసరాశియై, తొలకరిజల్లులై వచ్చింది
దూరవన చంపక సౌరభమువలె వచ్చింది
శ్రీనాథుడితోనో అంతటి
ఉద్దండపండిత కవితోనో
సరసాలాడిందా
అభిసారమున పరసీమల కేగిందా
ఆమె విరహిణికాదు, ముగ్ధకాదు
రమ్య అలంకారములతో నున్న
వాసవసజ్జిక, ప్రౌఢ, శాస్త్రకోవిద, కళాచతుర

నిండు హృదయము నుండి వెల్వడిన
మాట ప్రభావశాలి యగుతుంది
ఏ మధుర సన్నివేశములో
అన్నమాటల తీపో ఇది.
పెన్న దాటితే పెరుమాళ్ళ సేవ
అన్న నానుడి ప్రకారము
ఏ దక్షిణాది వైఖరి

ఆమె వేషభూషలలో కాన్పించిందో
ఫాల్గుణ పౌర్ణమిలో
రంగని తిరునాళ్ళలో
నృత్య మంజీర గాథల వినిపించిందో
మూలస్థానేశ్వరుని మండపాలలో
ఏ రాగరాగిణుల ఆలపించిందో
లేక, కౌగిలిలో ఏ సరసాలు, ఏ నర్మభాషణలు
చమత్కారముగ పలికిందో
కుంతలముల ఎంతో విన్నాణముగ
పెట్టి పరిమళ ద్రవ్యములతో అలంకరించిందో
సరసానికి సరసము
మాటల చమత్కారానికి చమత్కారములు
గడుసుతనానికి గడుసుతనము
ఎదుట చూపిందో,
ప్రజ్ఞతో నైపుణ్యముతో
పదిల చక్కబెట్టిందో
ఏనో ఆహ్వారణ, మధుర సన్నివేశములోనే
పూర్తి ఆహ్లాదమును ఆమోదమును సూచిస్తు
అన్ని నిండు మాటలే
వంశ పారంపర్యముగ సంక్రమిస్తున్న
వారసత్వపు విలువైన సంపద.

ఏ మేఘ మేదుర శ్రావణ సంధ్యయందో
ఏ కోకిల కూజిత చైత్ర నిశీథముననో
ఏ జ్యోత్స్నా విహ్వాల శారద పూర్ణిమనో
ఆనందాంతరంగుడై అన్న
అర్పిత అక్షరములో ఇవి

అన్నది ఎవడో, ఎట్టి స్థితిలోనో
చాటువువలె ఈ పదబంధము దక్కింది
ఈ గవాక్షము గుండా వీక్షించిన
ఎన్నైనా శృంగార కల్పనల చేయసాధ్యము
మేఖలలోని వజ్రపుతునక దొరికింది
కాల నేపథ్య ఇతిహాస రహస్యాల
మనమే వెతికి కనుగొనాలె
ఆ వినోదిని, విలాసిని, నిపుణ, చతుర
సంజె నీడలలో కొన్పించినా
ఆ రసికుడు, ప్రతిభావిదితుడు
అఖ్యాతముగానే అజ్ఞాతముగానే
లోకుల కల్పనలలోనే వసించుచున్నాడు.

ఎందులకో నెరజాణ
నా కవితా ముగ్ధను లేపింది
ఆమెకు తోడునీడగ చెలిగ
ఉండ గలదను నమ్మికతోనే
తట్టి లేపింది.
ఇద్దరి చెలిమిని చూస్తూ
నేను ముసిముసి నవ్వుల నవ్వుకొన్నాను.
నెల్లూరు నెరజాణకు
కావ్యగౌరవము దక్కిందని సంతసించాను
ఆమె రూపురేఖ
కవితలోనైన నాకు చిక్కిందని
సంతుష్టి చెందాను.

21-7 84
నెల్లూరు

# కాంగ్రెసు శతాబ్ది భవనము

కాంగ్రెసు చిన్న పడవను
వంద సంవత్సరముల పూర్వము
అనిశ్చిత రాజకీయ నీరాలపై
వదలినపుడు, ఎవరనుకొనిరి
పడవ పెద్దదై, అనేక అపూర్వ సంఘటనల
ఎదుర్కొని, తుఫాను రెక్కల వడిని
సుడిగుండాల కన్నుల దోషాన్ని తప్పించుకొని
స్వతంత్రభారత జండాతో
ఢిల్లీ యమునా జలాల చేరగలదని.

ఏ శతాబ్దములో, ఏ దేశములో
ఏ పురాణములో ఊహించని
త్యాగమహిమల ప్రదర్శించి,
విజయతూర్య నాదములతో
సునిశితముగా గమ్యధామమును చేరగలదని
ఉజ్జ్వల వీరగాథగా
పరిణామము చెందింది.
పరదేశ సామ్రాజ్యములకును
వైతాళిక గీతముల పాడింది
దీర్ఘకాల ఇతిహాస మృణాళముపై
వికసించిన వీరగంధపు పుండరీకమది.

శతాబ్ది ఉత్సవముల జరుపనున్నది.
నూరేళ్ళ చరిత్రతో పొర్లుచున్న
రాజకీయపార్టీలు చాల అరుదు.
త్యాగ గాథల మహాకావ్యమే కాంగ్రెసు.
స్వరాజ్యము పిదప
కాంగ్రెసు ప్రభుత్వాలు పాలింపసాగాయి
విద్యారంగములో పారిశ్రామిక రంగములో
విద్యుత్‌శక్తి విస్తరణలో
నీటి పారుదల దిశలలో
పెద్ద అభివృద్ధులే సాధించాయి.
దురదృష్టవశాత్తు, స్వరాజ్యసంప్రాప్తి
దేశవిభజన అమడాలుగా పుట్టాయి.
అహింసా త్యాగసమరము సల్పిన
కాంగ్రెసు ఉద్యమము, కాంగ్రెసు ప్రభుత్వాలు
కాంగ్రెసువాదులు
వేరు వేరు వ్యక్తిత్వాలను సంపాదించాయి
కాంగ్రెసు ఉద్యమమే మనము చర్చించేది.
అది తల్లి వంటిది.
శివాలయము వంటిది.
త్యాగవిభూతి మాత్రమే దొరికేది
రుద్రభూములలో విహరించే భైరవమూర్తి
ముతకబట్టలనే
గజవ్యాఘ్ర చర్మాలను తొడిగేది.

నెల్లూరు జిల్లాలో ఉచితరీతినే
పోరాటపు కష్టనష్టాలను ఎదుర్కొన్నారు

అపజయాలను విజయసోపానములుగ
మార్చింది
పరాజయములలో నేదదీర్చుకొన్నది
నూరుఏడుల పుట్టిక పండుగులకు
స్వాగతము చెప్ప ఉత్సాహము చూపుచున్నది

శతాబ్ది నూతన భవన ప్రారంభం
క్రొత్త ఉత్సాహాన్ని చిగిర్చేది.
నవవసంత మండపాలకు
తోరణాలు కట్టేది
ఆగామి విజయాల శుభానికి
హారతుల పట్టేది.
గత త్యాగ భూమికలను సంస్మరిస్తు
ముందు కార్యాల జపమాలను త్రిప్పుకొంటు
నూతన భవనము
శత కర్తవ్యాల దీక్షల చిరునవ్వు వెలుగులతో
దీపించగలదని విశ్వాసము.

ఈ శుభ తరుణములో
ఎరిగిన ఎందరు పెద్దలు
త్యాగసేవా ధర్మములచే
మరింత పెద్దవారై, మనల వీడిచనినారో
జ్ఞాపకముంచుకొనుట ధర్మము.
వారి సేవాదీక్షకు, త్యాగనిరతికి
కృతజ్ఞతా కరముల మోడ్చి
వినమ్ర భావముతో శిరముల వంచి

నమస్కరించి, మన హృదయ ఫలకముల
పునీత మొనర్చుదాము.
వారి చిరమౌనమునకు
జయనాదముల పలుకుదాము
వారి స్మృతి వాటికలు హృదయాలు నిత్య హరితనందనములు
కాగలవు.

4-8-84
నెల్లూరు.

# నటరాజు

అవతారాలు విష్ణువునకే.
అవతారాలు చాలించి అంతరములతో
వేరొక అవతారం వహించేది,
శివునికి అవతారాలు లేవు.
ఏకకాలములో అనేక అవతారాల
ఫలితాల ప్రదర్శిస్తారు.
విభిన్న ప్రకృతుల సంచయం
ఐశ్వర్యులకు కారణభూతుడు
ఆస్పదుడు ఈశ్వరుడు.
స్మశానములో కపాలముతో తిరిగే
ఆది భిక్షువు అతనే.
పాములతో ఆట్లాడేవాడూ అతనే
కాలకూటాన్ని కంఠమున దాచేవాడు అతనే
భైరవుడు అతనే శివుడు అతనే
గోపాలుడు కృష్ణుడైతే
పశుపతి ఈశ్వరుడే
పంచశరుని దహించేది అతనే
పార్వతిని ప్రేమించేది అతనే
వైదీశ్వరుడు, మృత్యుంజయుడు అతనే
సముద్ధరించేది సంహరించేది అతనే

సాహిత్య సంగీత [illegible]వులకు
ఉమా [illegible]స్ఫూర్తి యైతే
[illegible] వేదు నాదమునకు
ఆ[illegible] ష్ణదైతే
[illegible] ఆలౌకికానందముతో
[illegible] గలిగితే
[illegible] ఆమృతుడు నటరాజు.
తాళవిశేషముల విస్తరించి
[illegible]చుచు ఆడినవాడు
ఆ [illegible]డే.
సంగీతములో స్వరములకు ఎంత స్థానమో
ఆ[illegible]మకును గలదు
స్వరము ఎగిరే ఆకాశమైతే
లయ విశ్రమించే కులాయ మగుతుంది
ఎగిరి విశ్రమించాలె
విశ్రమించి ఎగరాలె
అదే [illegible] లక్షణము
సంగీతమునకు అదే ధర్మము.
అప్పుడే సంపూర్ణ మాధుర్యసుధను ఇచ్చేది
[illegible]త్వాన్ని కూర్చేది.
[illegible] స్వల్పముగ కాన్పించినా
అ[illegible] పలికేది
నటరాజుని హస్తభూషణ మది
హ[illegible]సాధన యది.
సంగీత [illegible]మయమై చిత్రవిచిత్ర
తాళ [illegible] చూపేది

అసాధారణ రవళితో
భూమ్యాకాశముల నింపేది.
సమస్త విశ్వము దాని రవములకై ఉత్కంఠతో చూచేది
తన్మయత్వపు ఆవేశముతో
ఆ నఖశిఖములు కర్ణపుటములై వినేవి
మూక జడత్వమునకు
సజీవ స్పందన కలిగించేవి
రసప్లావితములై తేలేవి
అవే నటరాజుని పాదలాఘవము
హస్తకౌశలము చూపేవి.
డమరు శబ్దాలు శివుని కూడా
ఉత్సాహపరిచేవి. ఉన్మత్తత కలిగించేవి.
పాదములలో కళాచైతన్యము జనించేది
తనువు రోమాంచితమయ్యేది
శైలశిఖరాల మీద మేఘాలవలె
మనస్సులో కళాభావాలు ముసిరేవి
పర్వతవేదిక సంకీర్ణము కాగా
భూ నభోంతరాళాల వేదికపై
తాండవలీలకై ఉపక్రమించేది
నృత్య క్రీడారసముల అవిశ్రామముగ చల్లేది.
విలంబిత శైలినుండి ద్రుతశైలివరకు
మార్చుకొనుచు క్రొత్త క్రొత్త తాళవిస్తారముల చూపేది
విభిన్నరీతుల పదవిక్షేపములు
అంగభంగిమలు హస్తచాలనములు
నేత్రసంచారితాలు !
ప్రణవనాదపు మూలరహస్యాల ఆవిష్కరించేవి

గగనము సమస్తము
కేశములు పర్వ, వ్యోమకేశుడగువాడు
తన్మయత్వముతో, ఆత్మవిస్మృతిలో
తాండవపు కేళను అపూర్వదిశలకు
లలితకోణములకు గైకొని చనువాడు
విశ్వము స్తంభించి తిలకించెడిది.
వాయువులు నిశ్చలములై చూచేవి
తారలు గ్రహములు సంభ్రాంతములయ్యేవి
కొన్ని వేళల డమరుధ్వనులు
తాండవమును అనుసరించును.
కొన్నివేళల డమరులయలు ముందు
నృత్య విన్యాసములు వెనుకసాగేవి
కడకు ఏకకాలమున సంయుక్తముగా
ద్రుతావేగమున నడిచేవి
ఏమి కళాసృష్టి, ఏమి నాదవాహిని!
మంత్రముగ్ధములై, బ్రహ్మాండచరాచరములు
తదేకదృష్టితో చూచేది.
పార్వతి కాంతదనుక లాస్య మొనరించి
శ్రాంతిదరితయై, ప్రతిమారూపమున నిలిచేది.
నటరాజు చూపిన తాళమార్గములే
నాట్యశాస్త్రములో తాళప్రకరణాలయ్యాయి
రంగేశ్వరుడు అవలంబించినదే
శాస్త్రము, సత్యము, సుందరము.

శివతాండవము బంధనముల ఛేదించేది
ఉన్మత్తసమీరాలవలె, స్వతంత్రములయ్యేది

భావబంధనజాలముల తిరస్కరించేది
ముక్తిని కోరేది.
సృష్టించేది, అనుసరణ ఎరుగనిది.

గతికి రసమాధుర్యాన్ని అలమినది
నాట్యము.
చెక్క కళాఖండముల సృజించినది నాట్యము
అరణ్యము శాఖాబాహంవులతో
నాట్యమొనర్చుచున్నది.
తరంగ కంఠముల విప్పి సముద్రము
తాళవిశేషముల వల్లించుచున్నది.
జటాజూటముల నుండి
కళాజాహ్నవి ప్రభవించుచున్నది.
ఆదిభిక్షువు, పశుపతి, నాగభూషణుడు
ఈశ్వరుడయ్యాడు, నటరాజయ్యాడు
ఐశ్వర్యములకు, సంగీత నాట్యశాస్త్రములకు
ఆద్యుడయ్యాడు.
సత్యం శివమైనది
శివము సుందరమైనది
గానలోలుడు కృష్ణుడైతే
నటలోలుడు శివుడైనాడు.
నటరాజు భావవేదికమీద
నాట్యమాడి, ముక్తిమార్గము చూపాడు
కళాగవాక్షముగుండా ముక్తిని చూపాడు.

**23-8-84**
నెల్లూరు

వారు ఇచ్చి పోయినదే
మన సంస్కృతీ సంపద.
శతాబ్దాల తరంగాఘాతములు
మ్లాన మొనర్పలేవు.
పూర్వకాల కళా స్మృతులతో
మందిర ప్రాంగణములో వచ్చి కూర్చున్నాను
నేటి యుగానికి తిరిగి వచ్చాను.
కళాలోకము నుండి
భక్తి లోకానికి వచ్చాను.

విశేష పర్వదినమగుటచే
భక్తులు తండోపతండములుగ వచ్చారు.
వారిని గమనిస్తుంటే
భక్తి స్రోత స్తీరమున ఉన్నట్లుగ తలచాను
గుడి ముంగలిలో మూర్తులకు ఎదురుగా
నిలిచి భక్తి భావములు చూపేవారు
చెంపలు కొట్టుకొనువారు
నెత్తిన మొట్టుకొనువారు
గుంజిల్లు పెట్టువారు
సాష్టాంగ పడువారు
నేలనుతాకి కళ్ళకద్దుకొనువారు
చేయెత్తి దండము పెట్టువారు
స్తోత్రము మెల్లగ పాడువారు.
మంత్రము పెదవుల కదిలిస్తు చెప్పువారు
దక్షిణాది జనులు చూపే భక్తి వీచికలు
శ్రద్ధగ చూచుటమే

ధార్మిక ప్రసంగము విన్నట్లుగ ఉండింది
తరతరాలుగ పారుచున్న భక్తి ప్రవాహమిది
పాలకులు మారారు, రాజ్యాలు అస్తమించాయి
దేవాలయ సంప్రదాయము మారలేదు.

భక్తి స్వచ్ఛమైనదేనా, నిష్కామమైనదేనా
లేక ఏదైనా కోరిక, కొరత,
జబ్బు, తగాదా అడుగున ఉన్నదా?
బాహ్య ప్రదర్శనలేని, అంతర్వాహిని అది
ఏదో భయమో. అనుమానమో
సందేహమో, వాంఛో భక్తి పొంగును
ఉబికించుచున్నదా అని వితర్కించుకొన్నాను
వాంఛా భరితమైన భక్తి
ఉత్తమమైనదేనా?
నిష్కామ భక్తి రీతి.
పురుగు తొలచిన పువ్వువలె
భక్తిని ఏదో చాయ అంటి యున్నది
సంతానము కొరకా, ఉన్నతికా,
రోగ నివారణకా ఈ భక్తి?
ఆ ప్రలోభముల ప్రోత్సాహము చేతనా
ఈ అం[illegible] అగమనాలు, భక్తి ప్రదర్శనాలు?

ఏదైనా కొరత భీతిని కలిగించుచున్నదా
రానున్న ఆపదల నివారణకా?
భక్తి ముసుగులో దాగి, సంకటాల దాడిని
తట్టుకొనుటకా?

సమస్యల సమరాలలో భక్తి కవచమా
బిడ్డలకో భర్తకో వచ్చిన రోగాన్ని
కుదుర్చ మ్రొక్కుబడుల చెల్లింపులు
ఏ ఉద్దేశ్యమో ఏ భీతో
శ్రావణ మేఘము రీతి ముసిరికొన
ఏ కోరికో ఇంద్ర ధనుస్సు వలె ఆకర్షింప
భక్తి మయూరము నాట్యము సల్పుచున్నది
అని తలపోసాను.
వాంఛా రహితమైన భక్తి
తుషారధౌత ప్రసూనము వంటిదే.
భక్తి కోలాహలముతో
నిష్కామ సౌరభ సుమాల
తెచ్చిన భక్తులును ఉండవచ్చుగదా?
అట్టి మహానుభావులకు
మనస్సులోనే నమస్కరించి
గుడి బయటికి వచ్చాను.

28-8-84
నెల్లూరు

# కురుక్షేత్రం

ఇక్కడ మరలా కొంత భాగం కర్ఫ్యూ
రాజకీయాల గందరగోళం
బక్రీద్, గణపతి నిమజ్జన
ఈలోపున ఏవో ఆందోళనలు
సెప్టెంబర్ 11వ తేదీ ఆందోళన
అంతా అనిశ్చిత పరిస్థితి

సంక్షుభిత వాతావరణము
అటూ హైదరాబాదు నుండి లేఖ
నిజమే, సంక్షుభిత వాతావరణము
అనిశ్చిత పరిస్థితి, ప్రశాంత చిత్తులకు
ఉద్రేక కాంక్షలకు అంతా వినోదమే
అంతా ప్రతీకార భావమే.

పోరాటాలలో మనస్సు చురుకుగ
పనిచేస్తుంది
క్రొత్త క్రొత్త పన్నాగాలు, వ్యూహాలు
అల్లుచునుంటుంది
కడపటి వరకు ఓటమిని ఒప్పని పట్టుదలలు
ఎత్తుకు ఎత్తులు వేసే ఊహలు

స్తబ్ధముగా ఉన్న ప్రజాశక్తి
ఉప్పెనయై లేచేది
సుడులు తిరుగుచు వడగాలి
తాటి ఎత్తుకు లేచేది
నురుగు నురుగులుగా
జీవననది పారేది
ఉత్సాహపు జ్యోతులు
మతాబులవలె మెరిసేది.
ప్రజానష్టము లేకుంటే బాగుండు
పోలీసు కాల్పులు లేకుంటే బాగుండు

ఈ ఉద్రిక్త ఉదంతము నన్ను
పౌరాణిక శతాబ్దాలకు లాగింది
సంఘటనగ వాక్షము గుండా వీక్షించిన
కురుక్షేత్ర యుద్ధము స్మరణకు వచ్చింది
గీతోపదేశాల వేదాంత సారాలు కాదు
సమర భూమిలోని ఉద్రిక్తతలు అనిశ్చితాలు.
శిబిరాలలోని ఆశా నిరాశా డోలికలు
పదునెనిమిది దినాల సంకులసమరాలు
బాణాల భల్లాలచే మూలిగే క్షతసైనికులు
గదాయుద్ధమున చితికిన అవయవాలు
వీర రక్తసిక్తమైన రణ ప్రాంగణాలు
యుద్ధ కోలాహల నినాదాలు, శంఖారవాలు
గాయపడిన ఏనుగుల గుర్రాల మూల్గులు
అక్షౌహిణులే నాశనమయ్యాయి
నరరుధిరముచే భూమిని మలినము చేశారు

ఎందరో అతిరథులు, మహారథులు
సేనాపతులు మడిశారు
హస్తినాపురములో ఇంద్రప్రస్థములో
సమర వార్తలు విని
ఎన్నెన్ని పద్మనయనాలు
అశ్రుభరితములయ్యాయో !

కబోది ధృతరాష్ట్రుడు
ఎన్ని మరణవార్తలు విని నిట్టూర్పులు విడిచాడో
హర హర అంటూ చెవులు కూడ మూశాడో
గాంధారీ కోడళ్లు ఎంత ఆక్రోశించారో
భానుమతి తెచ్చుకొన్న ధైర్యముతో
సంతాప భారముల అణచుకొని
నటన మాడిందో

ఎంత రక్తము కారింది
ఎంత కన్నీరు రాజమహాళ్ళలో ఒలికింది
ఎన్ని మరణవేదనలు
ఎన్ని కుళ్ళిన శవాల దుర్గంధాలు!
సమరనీతిలో న్యాయానికి ధర్మానికి
సమాధి కట్టారు.
ఆనాటి కురుక్షేత్ర వర్ధంతులు
చిన్నవో పెద్దవో అక్కడక్కడా
అప్పుడప్పుడు జరుపుకొంటూనేఉన్నాము
వీరభోజ్యము రాజ్యము

కలహాలు, మరణాలు అనివార్యాలు
వీరభారతగాథా లహరి
త్రుళ్ళిపడి సమసిపోయింది
కర్మశూరుల గేయమంజరి
పూచి వాడిపోయిందా!

నెల్లూరు
8-9-84

# కరహ్యాలో నిక్కా

మారక కరవాలాల ప్రాంగణములో
పెండ్లి సన్నాయి పలికింది
అమావాస్యా నిశీథమున
విద్యుత్ మెరిసింది
పుష్యమి వనమున
చైత్రము తొంగిచూచింది
గుడ్లగూబల రొదలలో
హంస నడిచింది, కోయిల కూసింది
క్రూర హింసాకాండలలో
సోదర సౌభ్రాతృత్వము సరళ స్మితము చేసింది
ఏడుపు కొలనులో
ప్రేమ పుండరీకము పూచింది
ద్వేష సరస్సులలో
చెలిమి సోనలు ఊరాయి
విష వాతావరణములో
అమృతపుజలు పొంగాయి
నిరాశ నిస్పృహలో
కాంతిమ రేఖ పొడకట్టింది
క్షామ దినాలలో
మబ్బు వాడి కురిసింది

సంకట కంటకాలలో
గులాబీ మొగ్గతొడిగింది
నాగుబాముల పొదలలో
పిల్లనగ్రోవి మ్రోగింది
నీలాభ్ర గగనములో
హరివిల్లు హర్షాన్ని చూపింది
నమాజ్ సంజెకేకలలో
గుడి గంటలు మ్రోగాయి
మసీదుల నీడలలో
గోకులము వెలసింది
హిందువుల సాయముతో
కర్ఫ్యూలో ముస్లిముల నిక్కా జరిగింది
మతకలహాలలో
వలపు చిగురు లేసింది

26-9-84
నెల్లూరు

# ఆత్మోన్నతి

వాంఛలు భవబంధాలు పెంచేవి
బంధవిముక్తుడవై జన్మరాహిత్యము పొందాలె
అదే జీవనలక్ష్యం
అని శాస్త్రాలు ఉపదేశిస్తాయి
వాంఛావృంతాలను త్రెంచుకొని
పద్మపత్ర వారిబిందు సమముగా
అంటీ అంటక మనవలెనని
గార్హస్థ్య జీవిత ధ్యేయం వానప్రస్థమని
వానప్రస్థము సన్యాసమునకు ముందు మాటయని
సన్యాసములో వాంఛారాహిత్యము
పూర్ణత్వము పొందునని
తనదంటూ ఏదీ ఉండరాదని
శాస్త్రాలు నొక్కి నొక్కి చెప్పాయి.
సన్యాసము చరమస్థితియని
జీవనముక్తికి సోపానమని ఘోషిస్తాయి.

సన్యాసిని దైవసమానముగా పూజిస్తాము
సమాజములో ఉన్నతాసనము వేస్తాము
ఐశ్వర్యములకు అధిపతి ఈశ్వరుడు
ఈశ్వరుని ఆదిభిక్షువుగాకూడ ఊహిస్తాము

తరతరములుగా సన్యాసమునకు
ఉచ్చతమ స్థానమొసగి, ప్రణామాలు
చేస్తూ వచ్చాము.
మజ్జాగతమైన సంస్కృతీ మూలస్తంభము
సన్యాస ఆరాధన.
భౌతిక మనోరథముల పరిత్యాగము
అలౌకిక జగత్తుకు గట్టి నిచ్చెన.

2. వాస్తవిక జగత్తులో
ప్రేమ పవిత్ర మైనది
దైవదత్తమగు వరదానము ప్రేమ
తోడిమానవుల శ్రద్ధాభక్తులతో సమాదరణ
మానవ సేవ సర్వోత్కృష్టమగు
మానవ లక్షణము అనియు
సమాజము చాటు చున్నది

ప్రేమకు ఎదురువ్యక్తి కావాలె
పరాశ్రితము ప్రేమలత
ఏకాంతములో ప్రేమ పుట్టదు
పరవ్యక్తిని అభిమానించి
అతని స్నేహమునో ఆదరమునో
అనురాగమునో అభిలషించి
సాంగత్యమును కోరుకొనుట
ప్రేమాంశము కావచ్చును.
ప్రేమ ఉత్తమమైనది
వాంఛ త్యజింప తగినది

ఇందు పరస్పర వైరుధ్యము లేదా?
ప్రేమస్థానము సన్యాసమునకన్న
తక్కువది కాదు.
ప్రేమ ఆకర్షించేది. ఆకట్టుకొనేది
ప్రేమ సూత్రములు పవిత్రమైనవి
ధాత్రి ప్రపంచమునకు ముడివేసేవి.
సన్యాసము అలౌకిక ప్రపంచ
ప్రాంగణమున విహరించేది
సన్యాసుల జనకులు సన్యాసులు కారు
ప్రేమానురాగములలోనే
పుట్టి సన్యాసులయ్యేది
రక్తిలేనిదే విరక్తి జనించదు
రక్తి ఉయ్యాలలో ఊగేదే విరక్తి శిశువు

3. సన్యాసము ప్రేమల ప్రసక్తి మాని
సమకాలీన ప్రపంచానికి వస్తే
ఏ రంగముననైన అగ్రసరులైనవారు
విజయ సిద్ధిని పొందిన వారు
వాంఛా ప్రేరితులే
వాంఛ స్వార్థమైనదికావచ్చు కాకపోవచ్చు
కాంక్షించనిదే, కార్యోన్ముఖులు కాలేరు
కాంక్ష దీక్ష పట్టుదల ఉత్సాహము
కలిగినవారే విజయాలను సాధించేది
నూతన సీమల చేజిక్కించేది
కర్మయోగపు పరిపూర్ణతను పొందేది
కర్మిష్ఠి అవమనేదే గీతాబోధ

కర్మభూమి నుండి పలాయనుడు
కావద్దనేదే గీతా రహస్యము
కర్మలో కోరికయున్నది
యత్నమున్నది, పట్టుదల యున్నది
వాంఛను వృద్ధిచెయ్యాలె
ఆత్మను పెంచాలె
ఉత్సాహాన్ని పెంచుకోవాలె
కష్టనష్టాలను సహించాలె
అపజయాలకు తెప్పరిల్లి తిరిగి యత్నించాలె.

గరుత్మంతునివలె క్రొత్త కొండల ఎక్కాలె
ఒంటెలవలె రేయిచీకట్లలో
ఎడారుల దాటాలె
జింకలవలె అడవులలో పరువెత్తాలె
పులివలె అవకాశము మీదికి దుమకాలె
ఏనుగువలె బాధ్యతా భారములు లాగాలె
ప్రతియత్నము లక్ష్యసిద్ధిని
చెందుతుందని హామీ లేనేలేదు.

బ్రతుకు ఎడతెంపులేని పోరాటము
అడ్డంకుల పందెము.
ఇనుమువలె గట్టియైనది.
నిప్పునకాల్చి సుత్తియంతోకొట్టి మార్చాలె
సహకారము పొందాలె
మిట్టపల్లముల స్వయముగా నేర్వాలె.
ఇతరుల సలహాల మీద
సొంత అనుభవాలను గడించాలె

మానవ పరభృతములు ఎగురవు, పాడవు
ప్రపంచము నీ గెలుపునకై
ఎదురు చూచుచున్నదని అనుకోకు
నీ రాకకు పరుచుటకు తివాచీలు లేవు
అంతా రాళ్ళబాటే, ముళ్ళత్రోవలే.
గట్టు అలలు నీ పడవను వెనుకకు నెట్టితే
చుట్టూ అడ్డుల పద్మవ్యూహాలె.
అయినా నీయత్నానికి తెరువని తలుపులు లేవు
దాటలేని లోయలు లేవు
ఎక్కలేని కొండలు లేవు
దిగలేని గనులు లేవు
ఏదీ నీది కాకపోయినా, అంతా నీదే.
అంతా నీమీదే ఆధారము
నీ లోకాన్ని నీవు సృష్టించుకోవాలె
నీ బాటను నీవు చేసుకోవాలె
నీ భాగ్యవిధాతవు నీవే.

ఆదాం వద్దన్న పండును తిని
స్వర్గసుఖముల నుండి గెంటబడ్డాడు
భూలోకపు సమస్యలతో నిండిన
స్వేచ్ఛను పొందాడు
పరీక్షలలో పెరిగాడు
స్వర్గపు మరుగుజ్జుల సీమల దాటుకొని
భూలోకపు స్వేచ్ఛామానవుడైనాడు
కోరికలు లేక, నీడగాయుండిన ఆదాం
కోరి పడడానికి లేవడానికి
స్వేచ్ఛను పొందాడు.

పాపపుణ్యముల చవిచూచాడు.
నిషేధాజ్ఞల ధిక్కరించి
క్రింద పడ్డాడు.
పడి లేచి ముందుకు నడిచాడు
**అదే** అతని అభ్యుదయ ప్రథమ సోపానం
పతనాన్ని శక్తిగా మార్చుకొన్నాడు.
పతనములోనే పీయూషాన్ని పిండుకొన్నాడు
ఫలసిద్ధి కాకుండుట
నిరుత్సాహ హేతువు కారాదు.

కోరిక చెడ్డదికాదు
యత్నించుట తప్పుకాదు.
తగిన పరికరముల చేర్చుకొని
ఆత్మస్థైర్యముతో, న్యాయరహితముకాని
పద్ధతితో జనుల గుర్తింపును కోరుట
దోషము కానేరదు.
నిచ్చెన ఎక్కవలె ఆత్మవిశ్వాసముతో
కాళ్ళకు చేతులకు బలిమిని చేకూర్చాలె
వీరులదే రాజ్యం
అనే నానుడే లక్ష్యం కావాలె
కార్యసాధనకు పూనాలె
ఆత్మోన్నతిని పొందుచు
కర్మయోగాన్ని అనుష్ఠించాలె
కర్మభూమిలో ముందుకు పోవాలె.

2-10-84.
నెల్లూరు

## రవల కమ్మలు

సుబ్బలక్షమ్మ కొన్న కమ్మలు బాగున్నవి
నేనూ కొనుక్కుంటే బాగుండును అన్నది ఆమె
అలాగే ఎంత అవుతుంది అన్నాడు భర్త
మహా ఐతే ఇరవై వేలకు మించదు
అన్నది అన్నం వడ్డిస్తూ ఆమె
సరే, కాని కొంచెము ఓపికపట్టు
ఇంతలో నా ప్రమోషన్ కూడా రావాలి
అన్నాడు అంగీకార సూచనగానే
మరలా ఎన్నడు ప్రస్తావించలేదు ఆమె
భర్త ఆమె కోరికను త్వరలో నెరవేర్చాలనే
నిశ్చయించుకొన్నాడు, అప్పుడప్పుడు
బ్యాంకు లెక్క చూస్తూనే ఉన్నాడు
సంవత్సరము దాటింది
ఒక సాయంత్రము లెక్క చూచుకొని
ఎప్పుడు పోదాము చెన్ననగరానికి
రవల నగలకు అదేగదా మంచి బజారు
ఇప్పటికే ఆలస్యమైనది అన్నాడు సందేహిస్తూ
తొందర ఏముంది, ఏదో సర్దా అన్నది
నవ్వుచు, దశరా సెలవులలో పోవడానికి
నిశ్చయించుకొన్నారు.

డిసెంబరులో నీ పుట్టినరోజుకు
ఇస్తారు ఆర్డరు చేసినా అన్నాడు ఉత్సాహంగా
మద్రాసులో ఉమ్మడియార్ దుకాణములో
తయారుగా ఉంచిన రవల కమ్మల జోడుని
మెచ్చింది, పదిహేడువేలైంది
ఇరవై వేలకు సిద్ధపడివచ్చిన దంపతులకు
మూడువేలు మిగిలినట్లుగ తోచింది
సంతోషమున తీసుకొన్నారు
తోడనే వేసుకుని అద్దములో చూచుకొన్నది
ముఖానికి చెవులకు బాగా అమరినాయి
అని సంతోషించింది, ఆమె సంతోషములో
భర్త సంతోషము ప్రక్క వాయిద్యముగా ఉంది
ఆమెకు అప్పుడే ఒక కోరిక కలిగింది
తనకి కాదు, భర్తకి రవ్వల ఉంగరము
కొని యివ్వాలని, తర్వాత ఎప్పుడో చెప్పింది
ఉంగరము విషయము, కావలిస్తే నీవే
కొనుక్కో, ప్రయాణాలు చేసే ఉద్యోగస్థులము
రవల ఉంగరాలు ప్రమాదకారకాలు
కాగలవు, అన్నాడు విసురుగ.

కొన్ని మాసాలు దాటాయి
ఆయుర్వేద వైద్యుని సలహాపై
మరల మద్రాసు ప్రయాణం
వారిని హోటల్‌లో నేను కలిసాను
వైద్యుని సలహా పొందాము
ఇవీ అవీ కొనుగోలు చేసి

సాయంత్రము బండికి పోతాము
అన్నారు, నా కారు ఉన్నది, నేను
తిరిగ్గా ఉన్నాను, రండి నాకారులోనే
తిరుగుదాము, మిమ్మ కలిసి
చాలా కాలమైందిగదా, అని అన్నాను
మౌంట్ రోడ్డుకు పోనీ, అని అన్నది ఆమె.

మౌంట్ రోడ్డు చేరాము
ఎక్కడ ఆపేది, సార్, అన్నాడు డ్రైవర్
ఉమ్మడియార్ దుకాణానికి, పోనీ, అన్నది ఆమె
వద్దండీ, విమల్ - అన్నాడు భర్త
ఉమ్మడియార్, అన్నది పెద్దగా
నో, నో, విమల్ బట్టల దుకాణానికి - అన్నాడు భర్త
మూడు తడవలు వూగింది ప్రశ్న
నేను డ్రైవరు చూస్తుండినాము
ఈ మినీ నాటికను
నాకు వింతగ తోచింది దృశ్యము
చెప్పరాని తీపి అలమింది హృదయములో
ఉమ్మడియార్ దుకాణము సమీపించాము
సార్, అన్నాడు డ్రైవరు నావంకచూచి
నేను ఆభరణాలకు వ్యతిరేకిని
ముఖ్యముగ మగవాళ్ళకు
అందులో రవల నగలంటే, అప్రియము
తిరిగి అమ్మినా ధర రాని రవలు
దండుగ బాపు, అసలేరాని
అందాల వ్యాపారము అని తలచేవాడిని.

విమల్, అన్నాను తీర్పునిస్తూ జడ్జి మాదిరిగ
ఉమ్మడియార్‌కి వెడదాము
ఏమండి, ఆయనకు రవల ఉంగరము
కొనాలని చాలనాళ్ళగ తలచాను
సొమ్ము నావద్ద ఉన్నది – అక్కడికి బండి త్రిప్పండి
అన్నది దీనంగా, అంతలో
విమల్ బట్టల దుకాణము చేరాము
భర్త, నేను దిగాము
ఆమె దిగి దుకాణములోనికి నడిచింది
కథ ముగిసింది
కథ ముగిసింది, ఆమె కోరిక ముగియలేదు
ఇప్పటికి వెలుగుచున్నది ఉజ్జ్వలముగ
ఈ ముక్తసరి సంభాషణల వెనుకనున్న
దాంపత్య అనురాగాల తెర తీయ లేదు
స్నిగ్ధ మౌన ప్రేమనది పారి
తరంగితమై ఎగయలేదు
అన్యోన్యతల ఆత్మీయతలు
వికసించి గుబాళించలేదు
స్తబ్ధముగ గభీరముగ ఏగుచున్న
ప్రవాహము శీకరముల ఎగజిమ్మలేదు
మృదు ప్రభాత సమీరాలు
గంధ భరితములై రోమాంచిత మొనర్పలేదు
అప్రకటితమై గుప్తముగ దాగి యుండిన
సంపద, మెరపువలె మెరసింది
ఇచ్చుటలోని ఆనందము గంతులేసింది
తాత్కాలిక పరాజయము శాశ్వత విజయమయ్యింది

చిన్న ఉదంతపు నిండు తీపితనము
అందరి స్మరణలలో ఉండిపోయింది
కవితా రూపును తాల్చింది

ఇట్టి మధుర సంఘటనలు లేవా జీవితములో
దాంపత్యములో చిన్న చిన్న పువ్వులే మాలలయ్యేది
ప్రేమలో మందహాసాల మౌక్తికాలే
కంఠహారాలు అయ్యేవి
ప్రేమలో నిట్టూర్పులు కన్నీరు ఉన్నవి
అంతకన్న ఎక్కువగ త్యాగ మధురిమలు
పరస్పరార్పణల గరిమలు
పరితృప్తుల ఆనందమయ ఆభరణాలు
రాసులుగ దాగియున్నాయి
ఆనందమే సముద్రాన్ని ఎగిరించేది
ఆనందమే పువ్వుల నవ్వించేది
స్వల్ప స్పందనల ఆనందమే
మనల బ్రతికించేది

13-5-1983 జగతి
శాంతినికేతన్ సెప్టెంబరు, 1983

# గంగా క్రతువు

ప్రకోపిస్తే మంద మలయమారుతమే
రుద్ర ఝుంఝూప్రభంజనము.
సముద్ర వక్షవేదికపై నర్తిల్లే
తరంగ పల్లవమే
ఉన్మత్త విలోల కల్లోలము.
చల్లగాపారే ఏటినీళ్ళే
సుడిగుండాలతో నురుగులతో
ఇండ్లను మ్రింగే వరదలు కాగలవు
గ్రామాలను లాలించి బుజ్జగించే నది
గ్రామాల ధ్వంసానికి పొంగులు పొందాయి
ముసలితనపు ఎండిన రొమ్ముతో కుంచే ఏరు
ముళ్ళల మంత్రదండముతో ప్రాయపు విసురుల పొంది
వెర్రికేకలతో వీర ప్రతాపాన్ని
ప్రదర్శిస్తాయి.
బ్రహ్మపుత్ర నిత్యయౌవన దౌష్ట్యముల చూపుతుంటుంది
ఇతర నదులు అప్పుడప్పుడు పొగరు పనుల చేస్తూ
భీతిని కల్పిస్తాయి.

విజ్ఞానసాధనలచే జలశక్తి వక్రాలే
సంపద సోపానాలయ్యాయి

వంకర గమనవిలాసాలే దూకుళ్ళు తొట్రుపాటులే
భూమాత దప్పికతీర్చి సస్యశ్యామలను చేశాయి
వేడిని వెలుతురును పుట్టించి
నగరాలను కాంతివంతము చేశాయి

ఎత్తగు కట్టలు కట్టి
మిట్టపొలాలకు నీరు పారించాయి.
జలమంత్ర బలముతో
భూదేవిని లక్ష్మీదేవిగా మార్చాయి.
సకల ఐశ్వర్యముల కారణభూతుడు ఈశ్వరుడు
ఆయనే గంగను ఔదల తాల్చాడు.
పురాణాలు గంగకు ఎంత ప్రాముఖ్యాన్ని ఇచ్చాయి!

గోదావరి అమృతజలాలు
క్షీరసాగరములో కలిసి వృథా అవుతాయి.
ఈ నష్టాన్ని పూరించుకోవాలె
గోదావరి నీళ్ళు విశాఖకు పోవాలె
కృష్ణకు తరలించాలె
కృష్ణ జల హస్తాలతో పినాకినిని మేల్కొల్పాలె.
పినాకిని మద్రాసు దప్పిక తీర్చాలె.
రాయలనాడును కనకాభిషేకము చెయ్యాలె
దేహములో రక్తనాళాలవలె
దేశమంతట కాలువలు పరుగిడి
అమృతాన్ని చిలకాలె
సస్యశ్యామలాం, వందే మాతరం
అని తరతరాలు ఘోషించాలె.
అదే భవిష్యత్తు ఆహ్వానం

అదే భగీరథ ప్రయత్నం
పాతాళ-గంగను పైకిరమ్మని ఆహ్వానించాలె
అభినవ భగీరథుల సాధనలు పూర్తికావాలె
వరదల బాధ, కరువుల బాధ తీరాలె
పుడమి దప్పికలు జనుల దప్పికలు తొలగాలె
అదే మన స్వప్నం, మన వ్రతం
స్వర్ణయుగము రావాలె
సకల జనులు సుఖముగ బ్రతకాలె.

పురాణ ప్రసిద్ధాలేకావు నదీనదాలు
ఇతిహాస దేవత కన్నుతెరచిందీ తీరాలలోనే
చరిత్ర పల్లవించినదీ తీరాలలోనే
మన సాంస్కృతిక లతలు
నదీ ఆలవాలములో పెరిగాయి
వేదాలు పుట్టింది
రామాయణ భారతాలు పెరిగింది
నదుల ఒడిలోనే
గంగా యమునలు వాల్మీకి వ్యాసుల
జన్మస్థలాలు
శిప్రా తీరాన కాళిదాసు
నన్నయ్య తిక్కన్న పెద్దన్న
నదీ ప్రాంతాలలోనే
నదీజలాలకు సాహితీ స్రవంతులకు
ఏదో సంబంధము.

ఎన్ని రాజ్యాల ఛత్రాలు నదీజలాలలో
నీడలు పరచినవో

ఎన్ని సమరాలో, ఎన్ని పతనాలో
ఎన్ని కుట్రలో, ఎన్ని ప్రణయలీలలో
ఎన్ని బృందావనాలో అయోధ్యలో కాశీక్షేత్రాలో
ఢిల్లీ కాన్పూర్ కలకత్తా పారిశ్రామిక నగరాలో
తాజ్‌మహల్ విరూపాక్ష కట్టడాలో
నదీ మృణాలాల వికసించింది
మన సాంస్కృతిక కమలం
పర్వతాలను సముద్రాన్ని
కలిపేవే నదులు.
తెలుగు నాడుకు ఉన్నది
దీర్ఘ సాగరతీరం
మన పర్వత శిఖరాలు
ముద్దిడవు గగన కపోలాలను
నదులున్నాయి నీళ్ళున్నాయి
భూతృష్ణ తీర్చుటకు
అదే గంగా క్రతువు
రససిక్తం చేయాలి నలు మూలలను
అప్పుడే సర్వతోముఖ వికాసం
ఐక్యతా సూత్రాల బంధించాలె దేశాన్ని
అట్టినాడు ఉదయిస్తుంది నవ్వులతో
జయము దేశమాతకు
శుభము దేశ జనానికి

20-5-83
శాంతినికేతన్
నెల్లూరు

# శాంతి

కొత్త ఇంటికి మారాము
శాంతినికేతన్ పేరిడినాము
ఇల్లు కట్టించడములో కష్టాలు
సామానుల మార్పులో కష్టాలు
అనుభవానికి వచ్చాయి
ఖర్చు ఎక్కువే అయింది
ఆధునికత ఇంటిలో వికసించింది
ఇల్లు ఇరుకుగా తోచింది.

ఇల్లు మారాము
ఒళ్ళు మారలేదు
మనస్సు మారలేదు
రోగాలు దేహదుర్గములో దాగేఉన్నవి
భావాలు రెక్కలు విప్పుచునే ఉన్నవి
కలలు పగటికలలు పాతవే
స్మరణలు అనుభవాలు పాతవే
గ్రహాలు మారలేదు
రాగద్వేషాలు మారలేదు
ఉద్వేగాలు ఉత్సాహాలు మారలేదు
చుట్టాలు స్నేహితులు మారలేదు
సమస్యల బుసలు వినబడుచునేయున్నవి

తీరని కోరికలు, తీర్చని బాకీలు
ఎద తలుపుల కొట్టుచునే ఉన్నవి

కాలం మారింది
పరిసరాలు మారాయి
క్రొత్త గదులకు అలవాటైనాము
క్రొత్త సౌకర్యాలకు అలవాటైనాము
క్రొత్త అంగీ వేశాము
మనిషి మాత్రము మారలేదు
క్రొత్త గవాక్షాలగుండా చూచాము
దూరపు విషయాలు దగ్గరైనవి
దగ్గర విషయాలు దూరమైనవి
క్రొత్త ఇరుగు పొరుగులు
క్రొత్త పక్షులు కొమ్మలమీద
క్రొత్త తీగలు పలుకరించాయి
క్రొత్త పశువులు పచ్చికబయళ్ళలో
రైళ్ళ పరుగులు కండ్ల యెదుటనే
కొంత క్రొత్త కొంత ప్రాత
బయట క్రొత్త లోపల ప్రాత.

పాత నక్షత్రాలు క్రొత్త సూర్యాస్తమానాలు
వీధి వేరు, ఇల్లు వేరు, పేరు వేరు
శాంతినికేతనన్నా, శాంతి దొరికిందా?
అంత సులభమా శాంతి
బహు సంఘటనల, అనుభవాల, ఆకాంక్షల

ఉలిచెక్కుల దిద్దబడినది మానవశిల్పం
దశాబ్దాలు మలిచాయి శిల్పమూర్తులను
శతాబ్దాలు బ్రతికేది శిల్పం.

సమరాలు సల్పుతారు విశ్వశాంతికి
మారణాస్త్రాలు సమకూరుస్తారు విశ్వశాంతికి
యుద్ధవిమానాలు ఎగురుచునేయున్నవి విశ్వశాంతికి
సమరజ్వాలలే కనిపిస్తున్నాయి దిగంతాలలో
క్రొత్త ఇంటిలో క్రొత్త పేరుతో శాంతిని అన్వేషించాలె
నిత్యయత్నమే చేయాలి చిత్తశాంతికి
ఎంతపూర్వరంగం కావాలె చిత్తశాంతికి
ఎన్ని నిగ్రహాలు కావాలె చిత్తశాంతికి
ఎన్నోపవిత్రతల ఆలేపనము కావాలె చిత్తశాంతికి
జీవన్ముక్తికి సోపానమే చిత్తశాంతి
అట్టి శాంతిని అభిలషించేది శాంతినికేతన్.
పొందేది ఎటులో
ఎన్ని ప్రయత్నాల ఫలమో
ఎన్ని నిగ్రహాల పర్యవసానమో
ఎంత దీక్షాఫలమో.

29-5-83
నెల్లూరు

శాంతినికేతన్
శంకుస్థాపన 26-2-82
గృహప్రవేశం 21-3-83
మారడం 29-4-83

# నివాసము-విహారము

పక్షికి కావాలె గూడు, ఆకాశము
సింహానికి కావాలె గుహ, అరణ్యము
మనిషికి కావాలె ఏకాంతము సమాజము
ఇవి పరస్పర ఆశ్రితాలే
పెరుగుదల ఆవశ్యకాలే
ఏకాంతములో మనస్సు పనిచేస్తుంది
ఆలోచిస్తుంది, ఆకాంక్షిస్తుంది
కలలలో విహరిస్తుంది
స్థూల నిర్ణయాలు చేస్తుంది
సమాజములో చూస్తుంది వింటుంది
సలహా పడుతుంది, సహకార మర్థిస్తుంది
పని చేస్తుంది, పని చేయిస్తుంది
ఏకాంతసంకల్పాలకు
క్రీడాభూమి సమాజము
సమాజప్రవాహాలకు
గంగోత్రి ఏకాంతము
విశ్రమించడానికి పొదగడానికి గూడు
తిండి వెదకుచు విహరించడానికి
ఆకాశము కావాలె విహంగానికి.

తల్లిఒడే బిడ్డకు ఏకాంతము
కాళ్ళకు కొద్దిశక్తిరాగానే కావాలె సమాజము
వీధిలోకి పోవాలె, పిల్లలతో ఆడాలె
ఆడవారికి ఇళ్లే క్షేత్రము
దేవాలయాలు, తిరునాళ్ళు, హరికథలు
తీర్థయాత్రలు, పెళ్ళిళ్ళు, పేరంటాళ్లు
జనసంపర్కాల కూరుస్తాయి.
మగవాళ్లకు పొలాలు, కర్మాగారాలు
కచ్చేరీలు, క్లబ్బులు, ప్రయాణాలు
సంపాదనలకు వినోదాలకు.
పనిలేకుంటే ఊళ్లోకి పోతాడు
నలుగురిని చూడడానికి, మాట్లాడడానికి
విసుగుదలలేకుండా మనస్సును
తేలికగా ఉంచడానికి
కబుర్లు చెప్పాలె వినాలె
ఇంట పాతచీర, బయట పట్టు చీరలోని
వేదాంతము ఆడవారికే తెలుసు.
వీధిలోని మల్లె చెండు అర్థంకూడా
కడకు తూర్పున పొడిచే సూర్యుడు కూడ
ఉత్తరానికి దక్షిణానికి
వాహ్యాళికి వెళ్ళుతాడు.
మందిరములోని దేవుడు కూడ
ఉత్సవ అలంకారాలతో ఊరేగింపుకు పోతాడు

గంగోత్రిలో బయలు దేరిన శిల
నీళ్ళల్లో మునుగుచు తేలుచు

ఎన్ని తాకుడులకు త్రిప్పులకు
దూకుడులకు గురియగుచు
చర్మములేని నున్నని దేహముతో
హరిద్వారము చేరుతుందో!
మానవుడును జీవనయాత్రలో
ఎన్ని అనుభవాలను భావాలను
నెట్టుకొనుచూ వెళ్ళుతాడో
బహుసంఘటనల ఉలి నొక్కులతో
తీర్చబడినది మానవ విగ్రహము!
ఎన్ని క్రొత్త విషయాలను చూస్తాడు
వింటాడు చదువుతాడు ఆలోచిస్తాడు
వీనిలో కొన్నైనా చెరగని ముద్రల వేయవా
నిత్య నవ నిర్మితుడు మానవుడు
నిన్నటి మనిషి వేరు
రేపటి మనిషి వేరు
పాతసరకుల దింపాడు
క్రొత్తవి చేకూర్చుకొన్నాడు

క్రొత్తమిత్రుని కలిసినప్పుడు
క్రొత్త అనుభవ మండపముల మధ్య నడచినట్లే
క్రొత్త మానస సరస్సులో స్నానమాడినట్లే
క్రొత్త అనుభూతులు కలుగుతాయి
క్రొత్త దృశ్యాలు గోచరిస్తాయి
క్రొత్త మధురిమలు చవి చూపుతాయి
క్రొత్త దేశములో సంచరించినటుల ఉంటుంది
స్నేహితుడు వ్యక్తిగా కాన్పించినా

బహుభావాల సంచయము
బహు సంకల్పాల పరిణామము
మంచి స్నేహితుడు అమూల్య సంపద
అజ్ఞాత మధుర సూత్రాలు ముడివేస్తాయి
హృదయ కవాటాల తెరచి
ఆహ్వానించాలను కోరిక ఉదయిస్తుంది
అప్పుడప్పుడు కలియాలని కుతూహలము

దినానికి ఒక మంచి మిత్రుని కలిస్తే
మనిషి వేయి బ్రతుకులు బ్రతుకును
అని అరేబియావారి సామెత
పుణ్యఫలమే ఉత్తమ స్నేహితుడు
దినమూ పువ్వులు పూస్తుంటే
నిత్య వసంతము వనానికి

14-6-83
నెల్లూరు

# హేమంతము

పెరిగే చెట్టు ఆకుల రాలుస్తున్నది
కుంతల తిమిరకుంజముల్లో
రజతరేఖలు ముగ్గులు రచిస్తున్నవి
జ్యోత్స్న ముఖమును హిమవసనములు
మ్లాన మొనరుచ్చుచున్నవి
హేమంత ఆగమన చిహ్నములా
శిశిర పూర్వభూమికా?
జీవన మార్తాండుడు
పశ్చిమ గిరి చరియలకు ఏగుచున్నాడా
ఇంతలోనే వసంత వర్ష శరత్తులు చనెనా
సంధ్యాతమస్సులు జాలముల పర్వనున్నవా.

అయ్యో జీవితమా
రాల్చవలసిన కన్నీరు కార్చితివా
అంక బాష్పాభిషేకము సమాప్తమా
ఇంకను ఎవరికొరకు కన్నీరు మిగిల్చితివి
ఏ పొందని కోరికలకై
ఏ తీరని ఆనందాలకై.

రేవునకు పడవ వచ్చుచున్నది
దూరాల తీరమునకు

తెలియని దవ్వులకు
మసక వెలుగులలో ఏగెదవా
ఒంటరిగనే చనెదవా
నీ వేణువును ఎవరికిచ్చి పోయెదవు
మిగిల్చిన అశ్రుపాత్రముల
పాథేయముగ భుజాలకు చేర్చితివా
చను చను బాటసారీ
క్షణకాలపు 'అతిథివై' వచ్చితివి
చీకట్లు క్రమ్మకమునుపే వెడలిపొమ్మ.

17-6-83
నెల్లూరు

# ఆల్బమ్స్

కాసారములో శైవాల రాసుల మాదిరి
పడి యుండినాయి ఆల్బమ్ములు
బహుకాలాల ఉపేక్షాశాపాలు
అణచి ఉంచినాయి.

ఇంటి మార్పు కారణాన
శాపవిమోచన జరిగింది

దుమ్మును దుల్పి ఆల్బమ్ముల తిరుగ వేశాను
అనేక వత్సరాల స్మృతులు
కన్నులు సగము తెరచి
మేల్కొని పరికించాయి నావైపు.

అహల్యలే స్మృతి వసన ధారిణులై
చిత్ర రూపమున శయనించాయి
నా కర స్పర్శచే మేల్కొని
స్మృతి వీథులలో విహరించాయి.

ఏనాటిదో ఆ ఉత్సవ సంపద?
సకల వివరాలు జ్ఞప్తికిరావు.
ప్రక్కనున్న స్నేహితులు జ్ఞప్తికిరారు
ఊహలతో నిర్ణయించుకోవాలె

కొన్ని చిత్రములు పూర్తి వివరములతోనే
వెలికివచ్చాయి. పెక్కుమంది మిత్రులు చనిపోయారు.

ఉన్నవారు ముసలితనపు దుప్పటి కప్పి
పోలికలతో గుర్తుకు వచ్చారు.
తెలిపిననే తెలిసికొనే స్థితిలో ఉన్నారు
కొందరు వయస్సుచే వికసించి
తళతళలాడుచున్నారు.

బహురూపి, బహువేషధారి కాలము
చంపినది, ముదిమి ముడతల నిచ్చినది
కాలభ్రమణమే
క్రొత్త శోభాదీప్తుల నిచ్చినది కాల ఆశీస్సే
కాల నిష్ఠుర హస్తము కరుణ హస్తమును
కాగలదు
నిర్మల గగన విహారము చేయగలదు
ధూళి దూసరితమును కాగలదు
కిసలయ అరుణ అధరములను చూపగలదు
వృద్ధ పత్రముల శిథిలకపోలములను చూపగలదు.

ఆనాళ్ళ నా పదవీ వైభవ దీపములు
ఏమాయెను?
నా యౌవన రూపురేఖలు ఎటుల
మాసిపోయెను?
భూతకాల నేపథ్యమున ఏ ఉత్సవముల
దర్పమును పెంచుతు వెలుగుచున్నవి?

చరిత్రపుటలలో కనబడని అక్షరాల మధ్య
వెలుగును కోల్పోయి కబోదియైనవా?
నిన్నల చీకటి ఎడారుల ఇసుక రవలలో
కలిసిపోయినవా?
కాల మంత్రగాని అదృశ్య ఐంద్రజాల హస్తము
రూపాకృతుల వికృత పరిచినవా?
వికసింపజేసి కొన్ని వేళల
వర్తమాన యవనిక మీద ప్రదర్శించినవా?

ఫోటోలు భూతకాల నీరాలలో
బహువర్ణస్మృతి బుద్బుదాలను లేపాయి
స్మృతి ప్రవాహాల తిలకించి మనసు దస్సిపోయింది
తెలియరాని ఉదాసీనత హృదయాన్ని క్రమ్మింది
ఏదో జ్ఞాపకము పైకివచ్చి,
మంచినో, చెడ్డనో వెనజల్లిపోయేది.

ఆల్బమ్ములు పెక్కు జ్ఞాపకాలను త్రవ్వుతుంటాయి
గత వైభవాల శిథిలస్మరణలే
భూతకాల మనసులను చూపే గవాక్షాలే
ఈ బొమ్మల సంపుటాలు
వాడిన పూలరేకల మిగిలిన సువాసనలే
ఈ బొమ్మల సంపుటాలు

జరుగుచు జారిపోతున్న భూతకాలాన్ని
పట్టి ఉంచుకోవాలని మానవుని యత్నం.
విజ్ఞానాన్ని వినియోగించుకొంటాడు

కంఠ మాధుర్యాన్ని ప్రతిధ్వనిగనైన వింటున్నాడు
వాడిపొయ్యే పండ్లను కొంతకాలానికైన
నిలువ చేసికొనుచున్నాడు.

పూర్తిగ అదృశ్యమయ్యే భూతకాలాన్ని
శృంఖలాలతో పట్టి ఉంచాలని కోరిక
ప్రాతమేతను నెమరువేయాలని కోరిక
ధ్వనితోకూడిన రూపాన్ని సినిమాలో చూస్తారు
గతకాలము పోతూ పోతూ
అడుగు జాడలు కొద్దిగ వదులుతూ పోతుంది
అవి చిరకాలము మన్నేవి కావు
చూడలేని ముఖబింబాలను
ప్రతిబింబాలుగా చూస్తాము
వినలేని ధ్వనులను
ప్రతిధ్వనులుగ వింటాము

మరి భవిష్యత్తో ?
ఊహలలో తప్ప సాధ్యము కానిది
నిత్య నిరీక్షణ భవిష్యత్తు ఉపయోగమునకై

12-7-83
నెల్లూరు

జగతి
సెప్టెంబరు, 8[illegible]

# ఎంతటి ఉపేక్ష

1. చూడాలని కోరిక-వేడిమితో వస్తే
పత్రికతో ముఖము దాస్తావా?
ఎంతటి నిర్దయ, ఎంతటి ఉపేక్ష

2. ఉపయోగించమని వస్తువునిస్తే
వాడితే మాసిపోతుందని
మూల పారేస్తావా?
ఎంతటి చమత్కారం, ఎంతటి ఉపేక్ష

3. పెదవుల సంచిలో మాటల దాస్తావు
పేటిక విప్పితే మాట ముత్యాలు జారిపోతాయా
ఎంతటి లోభత్వం, ఎంతటి ఉపేక్ష

4. సలహాలు కోరగావు, పొరపాటుల ఒప్పుకోవు
నీదారే నీది, నీ మతమే నీది
ఎంత మొండితనము, ఎంతటి ఉపేక్ష

5. లోకుల జ్ఞానం మట్టగించినదంటే కోపమా
జానెడు మనిషిని మూరెడు చేస్తావు
మూరెడు మనిషిని జానెడు చేస్తావు
కనబరచని కోపాన్ని, మౌనపు ఒరలో దాస్తావా?
ఎంతటి గడుసుతనం, ఎంతటి ఉపేక్ష

అపేక్షల అనురాగాలతో వస్తే
క్లుప్తంగా మాట్లాడి, టీ యిచ్చి పంపేస్తావా
మంచి మర్యాదే, ఎంతటి ఉపేక్ష

అపేక్షల దండులకు ఉపేక్షల దండులకు
సమరాలు ఇలలో ప్రసిద్ధాలే
తుది విజయం ఉపేక్షల సైన్యాలకే
అపేక్షలకు మిగిలేది నిట్టూర్పులే కన్నీరే
ఎంతటి నిర్దయ, ఎంతటి ఉపేక్ష

5-5-83
ఢిల్లీ

# పిల్ల కోపము

నా పిల్ల కోపమూ కావ్యవస్తువు అయ్యింది
దానికి కవితా మందిరము కట్టారు
వేణుగానము వేదనాగానము కాగ
వ్రజ బాలికలు విరహవ్యాకులతను చెందారు.

నా పిల్లకోపపు పందిరి చుట్టూ
ముసిరి నవ్వుల మల్లికలు అల్లాయి.
శైశవార్భటుల తాళములకు
మల్లికలు లాస్యము చేశాయి
మంజీర మధురస్వరాలు
నలుదిశల వ్యాపించాయి
మలయ మారుతాలు.
పరవశించి చేయెత్తి పిలిచాయి.
శుక శారికా పికాలను
వసంతవనము సౌరభాల చల్లింది
చందన చర్చిత రాత్రముల
జ్యోత్స్నా కరాలు గిలిగింతలు పెట్టాయి
నక్షత్రాలు తిమిరగవాక్షాలనుండి
తొంగి తొంగి చూచాయి
అంతా ఆనంద విహ్వలత

గానము వ్యాకులతను రేకెత్తించడము
పిల్ల కోపము ఆనందమును చిగిర్చడము విపరీతాలే
విపరీతాల సమన్వయమే
ఆధునిక సభ్యతా ప్రయత్నం

22-5-84

నెల్లూరు

# వీచికలు

జీవితము, ఎంత రమ్యనందనము
అనుభూతులు ఎన్ని ఆకాంక్షపరిమళాలు
దానికి ఇయ్యగలిగినదేమి?
మందస్మిత మరణ నీరాజనము తప్ప

తరంగమా, ఈ తీరమున
నీకు విజయం ప్రాప్తికాలేదు
నూతన తీరముల అన్వేషించుకో

వడిలేకున్న బొంగరము తిరుగదు
పడుటకు ముందు
ఎన్ని వయ్యారముల చూపుతుంది

బ్రతుకు ఎడారుల్లో
సమస్యలు తోడేళ్ళవలె తరుముతాయి
పరుగెత్తి ఎక్కడికిపోతావు
ఎదురు తిరిగి తోడేళ్ళపైపడు

తుఫానులో
తీరమున ఆశ్రయము నెమకుచు
పడవ సమీపించింది
తీరతరంగములు నెట్టివేయుచునే ఉండినవి
లంగరు వేయుటకును చోటు దొరకలేదు
పడవ మునిగింది లంగరుతో కూడ

సంజెమసకలు
చుట్టు మూగిన మొయిళ్ళతో
కొబ్బరి అరటి ఆకులతో
మరింత దట్టములై నల్లబడినవి
పాపుల ప్రేతాలవలె.

దశాబ్దములో ఆ ఇంట ఎన్ని మార్పులు!
కొందరు చనిపోవ
కొందరు బ్రతుకుదెరువు వేటలో
పరసీమల అడవులకు వెడల
కొందరు పెండ్లాడి దూర గ్రామములలో
ఊడల వేసికొని స్థిరపడ
వర్ణాంతర వధువులు
అంటుమామిడులవలె నాటుకొన
తల్లిమాత్రము
దవడ ముడతలు, వయస్సు లెక్కలు మాన
వైధవ్య వృద్ధాప్య ఏకాంతముతో
మంచముమీద ముడుచుకొనేయున్నది

బస్సు ప్రమాదములో
కొందరు చనిపోవ
తాను చిన్న ఫ్రాక్చరుతో బయటపడి
ఆసుపత్రిలో చికిత్స పొందాడు
నెలవులలో సంకల్పించిన
కార్యప్రణాళిక
వ్యర్థమైనదని వగచాడు
అదృష్టానికి సంతసించుటకు మారుగా

సరోవర జలముకుర లోకములో
పరిసరాల ప్రతిరూపుల గమనిస్తున్నాను
చెట్లు కదలుటలు పక్షులు ఎగురుటలు చూస్తున్నాను
నిర్మలముగానున్న నీరాలను
నీడలు కలత పెట్టుచున్నవి
నీళ్ళకు నీడలనుండి విముక్తి లేదా?

బారులుగా వెడలుచున్న పిట్టల కేకలు
రేయి దట్టమగు చీకటి మడతల
చీల్చుకొని వచ్చుచున్నవి
చీకట్ల అంతఃపురాలకు
దర్వాజాల బిగించి, ప్రశాంతముగా ఉండే
అధికారము లేదా?

నగ్నంగా విహరించుచున్న చీకటిని
ఆందోళన పరచింది నా అగ్గిపుల్ల వెలుగు
అంతర రహస్యాలను వెలికి లాగింది
చీకటి ఏనుగులకు
కొరడా యైనది చిన్న వెలుగు.

9-10-84
రైలులో